# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక





చందా వివరాలు

జీవిత చందా... ... ..రూ॥ 350/-

3. సంవత్సరాల చందా ..రూ॥ 85/-

సంవత్సర చందా. .. .రూ॥ 30/-

ఎయిర్ మెయిల్ (1సం॥) రూ॥ 125/-

సీ మెయిల్ (1సం॥). . .రూ॥ 70/-

చందా పంపవలసిన చిరునామా



9, దేశికార్ రోడ్, మైలాపూర్

మద్రాస్-600004

ఫోన్ 75926


ఏప్రిల్ 1989



తెలుగు విస్డమ్ కు ఇది ఎనిమిదవ సంవత్సరం

## కారణంతోటే ఉపాయం ఉంటుంది




అసలు కారణం లేకుండా ఏదీ జరుగదు. ఒక వ్యక్తి కష్టసుఖాలు ఆ వ్యక్తి చేసుకున్న కర్మఫలితాలే. బంధమో, విడుదలో ఈ రెండూ నీ చేతిలో ఉన్నవే. మనిషి కష్టాలకూ, దారిద్ర్యాలకూ కారణం మనిషిలోనే ఉంటుంది. అన్నిటికి మూలం నీలోనే ఉంది. సంకల్పం ఉంటే స్వాతంత్ర్యం సిద్ధించింది అన్నమాటె. ఏ మనిషికైనా పుట్టుకతోనే విశిష్ట లక్షణం, ప్రత్యేక వ్యక్తిత్వం, భిన్న స్వభావం సహజము. నీవు మానవులలో మానవుడవు అయినా నీవు ప్రత్యేక మానవుడనేది మరచి పోకు.

లేమి నిన్ను పట్టుకు పీడిస్తూందం టావు. నీ కెవ్వరి సహాయం లేదని వాపోతావు. ఒంటరితనంతో బెంబేలు పడిపోతావు. జీవిత భారం భరించ

(మిగతా 4 వ పేజీలో)

## స్త్రీ విద్య

సర్వతోముఖాభివృద్ధికి మూలకారణం స్త్రీ విద్య. ప్రాచీన వాఙ్మయంలో విద్యావంతులైన స్త్రీలు ఎందరో ఉన్నారు. ఆ యుగంలో స్త్రీలు ఎక్కువ ఉన్నత స్థితిలో ఉన్నారు. వేదకాలంలో స్త్రీలు పురుషులతో సమాన గౌరవాన్ని అనుభవించారు. విద్యార్హతలున్న స్త్రీలకు సంఘంలో ఉన్నత స్థితి ఉండేది. గార్గి, మైత్రేయి, సావిత్రి మొదలైనవారు ఉన్నత విద్యావంతులైనట్లు విదితమవుతూంది. ఆనాడు స్త్రీలు సాంఘికంగా గౌరవ స్థానాలను పొందారు. మొల్ల, కళ్యాణదేవి రచించిన రచనలు ప్రజల ఆదరాభిమానాలను పొందుతున్నాయి. లీలావతి గణితశాస్త్రంలో, తర్కశాస్త్రంలో గ్రంథాలు రచించింది. యాజ్ఞవల్క్యుడు తన భార్యకు తత్త్వ రహస్యాలను చెప్పాడు.

జీవితంలో స్త్రీలకు విద్యాప్రాముఖ్యతను భారతదేశం ఇటీవలే గ్రహించింది. స్త్రీ విద్యార్థినుల సంఖ్య తక్కువైనా ఇటీవల చదువుకునే మహిళలు అధికంగా ఉన్నారని చెప్పక తప్పదు. జపాను, చైనా, సింగపూరు, దక్షిణ కొరియా మొదలైన ఆసియా దేశాలు స్త్రీ విద్యావిషయంలో భారతదేశం కంటే ఎంతో ప్రగతిని పొందాయి. స్త్రీ విద్యకు నేడు నిరసనభావం లేదు. సక్రమమైన విద్యవల్ల గృహిణి ఇంటిని చక్కగా సరిదిద్దుకుంటుంది. తన పిల్లలను సక్రమ విధానంలో పెంచుతుంది. చదువుకున్న స్త్రీ

తన పనిని ఉత్తమ విధానంలో శీఘ్రంగా నిర్వర్తించగలుగుతుంది. సరియైన విద్య, శిక్షణ వల్ల స్త్రీకి నాజూకుతనం, మర్యాద అలవడుతాయి. ప్రస్తుతం స్త్రీలు నిరుపయోగ



కరంగా కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. కుటుంబంలో ఆదాయానికి సహకరించగల వృత్తి విద్యను. లలితకళలను స్త్రీలకు నేర్పి ప్రోత్సహించాలి.

మన యూనివర్శిటీలలో పట్టభద్రతలను పొందే ప్రతీ విద్యావంతుడు తన భార్యను, ఇతర స్త్రీలను విద్యావంతులుగా చేస్తానని యూనివర్శిటీ స్నాతకోత్సవంలో ప్రతిజ్ఞచేసి దీక్షాకంకణం ధరించాలి.

"ఒక బాలుని విద్యావంతునిగా చేస్తే ఒకే ఒక వ్యక్తి విద్యావంతుడవుతున్నాడు కాని ఒక స్త్రీని విద్యావంతురాలుగా చేస్తే కుటుంబాన్నంతటినీ విద్యావంతులుగా చేస్తుంది" అని అంటున్నాడు ఫ్రాన్స్ విద్యాశాఖ మంత్రిగా ఉన్న పాల్‌బెర్ట్.

## 681 కిలోమీటర్ల మార్గం విద్యుదీకరణ చేయబడింది

1987-88 సం.లో భారతీయ రైలుసంస్థ 681 కిలోమీటర్ల రైలుమార్గం విద్యుదీకరణ చేసింది.

## మైక్రోసెకండ్ల కాలంలో పెంటగన్ నుంచి హెచ్చరికలు

పెంటగన్-పంచముఖ భవనం (ఆకారం నుంచి పేరు ఏర్పడింది) యునైటెడ్ స్టేట్స్ సాయుధ దళాల ముఖ్య కేంద్రం. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో 83 మిలియను డాలర్లు వెచ్చించి 19 మాసాలలో ఇది నిర్మించబడింది. దీని వైశాల్యం, న్యూయార్క్ 102 అంతస్తుల ఎంపైర్ స్టేటు భవనం వైశాల్యానికి మూడు రెట్లు ఉంటుంది.

"పెంటగన్" నగరంలో ఒక నగరం వంటిది. ఇక్కడ హాస్పిటళ్లు, కెఫేటేరియాలు, ఆహారం నిలవచేసే గిడ్డంగులు, షాపింగ్ సెంటర్లు, హెలీపోర్టు, స్విమ్మింగ్ పూలు వగైరా అన్నీ ఉంటాయి. టెలివిజన్ కెమేరాలు మిలటరీ ఆపరేషన్ గదుల వద్ద రాకపోకలను గమనిస్తుంటాయి.

బ్రహ్మాండమైన ఈ భవనం బేస్‌మెంట్‌లో దీపాలు ఆరిపోవటం అంటూ ఎప్పుడూ ఉండదు. సంవత్సరం పొడుగునా ప్రతి నిమిషం మనుషులు పని చేస్తుంటారు. ముఖ్యమైన ఎయిర్‌ఫోర్స్ కమాండ్ పోస్టు భవనం క్రిందిభాగంలో ఉంది. శత్రువులు శబ్దం కంటే అధిక వేగంగా మీద పడవచ్చు. ఆ వార్త, దానికి తగిన నిర్ణయం సెకండ్ల మీద పంపడం అవసరం. ఈ పెంటగన్‌నుంచి హెచ్చరిక వార్తలు మైక్రో సెకండ్ల కాలంలో పంపవచ్చు. ఒక్క నిమిషంలో నేషనల్ ఎమర్జన్సీని సంసిద్ధం చేయవచ్చు.

రాఘవేంద్రరావు

కర్ణాటకాలో బెల్గాంకు ఆగ్నేయ దిక్కుగా 40 కి.మీ. ల దూరంలో కిట్టూరుకోట ఉంది. 1828 లో ఇక్కడ భయంకరమైన ఘోర యుద్ధం సంభవించింది. అప్పుడు అక్కడ కిట్టూరు వీరవనిత రాణి చెన్నమ్మ బ్రిటిషు సామ్రాజ్యాన్ని సాహసంతో ఎదిరిస్తూ కత్తిపట్టింది.




భారతదేశపు రజియా సుల్తానా, చాంద్ బీబీ, రాణి దుర్గావతి, ఝాన్సీరాణి లక్ష్మీబాయి వంటి వీరవనితల కోవకు చెందినది ఈమె. కిట్టూరు మల్లాసర్జా దేశాయి ఇరువురి భార్యలలో చెన్నమ్మ రెండవ భార్య. 1585 లో కిట్టూరు ఏర్పడింది. 1816 లో మల్లాసర్జా మరణించాడు. అతని కుమారుడు శివలింగరుద్రసర్జా పాలకుడయ్యాడు. కానీ ఇతనికి సంతానం లేదు.

బ్రిటిషువారు ఈ అవకాశాన్ని వినియోగించుకుని కిట్టూరును వశపరచుకోడానికి ప్రయత్నించారు. దీనికి ముఖ్యకారకుడు ఆనాడు ధార్వాడ్ కలెక్టరు జె. థాకరే. ఇట్టి విషమపరిస్థితులకు తోడు సర్జా ఆరోగ్యం

( 2 వ పేజీ తరువాయి)

డానికి ఎవరో అన్యులు వచ్చి సహాయపడతారని ఎదురు చూస్తూంటావు. ఇది ఎన్నటికీ తగ్గే భారంకాదు. ఈ భారం ఏనాటి కానాడు ఇతోధికంగా పెరుగుతూంటుంది.

ఇలా భారం పెరుగుతూన్నకొద్దీ అంధకారం ఆవరించుకు పోతుంది. అదృష్టం లేదని విచారిస్తావు. పవిత్రమైన నీ జన్మను దూషించుకుంటావు. నీ జన్మకు కారకులైన నీ పూజ్య తలిదండ్రులను గర్హిస్తావు. నీ అధికారిని నిందిస్తావు. పేదరికం, కష్టం నీకు అనర్థం అనుకుంటావు. ఇంకొకరు నీకు లేని భాగ్యంతో, సుఖంతో ఆనందిస్తున్నారని ఈర్ష్యపడతావు అంతా అన్యాయమంటావు. న్యాయం లోపిస్తే సృష్టి ఒక్క క్షణం జరుగదు. కోపంతో కలతపడిపోకు. అనవసరంగా మొరపెట్టుకోకు.

అన్నిటికీ కారణాలు నీలోనే ఉన్నాయి. కారణం ఉన్నచోటే ఉపాయం ఉంటుంది. కారణం లేనిదే ఏదీ జరగదు. ఉపాయం నీ అధీనంలో ఉంది. నీ లేమికి నీ కష్టాలకు ఇతరులు కారణంకాదు. దీర్ఘంగా ఆలోచిస్తే అంతా వట్టి భ్రమ, భ్రాంతి.

చెడిపోయి సెప్టెంబరు 11, 1828 లో మరణించాడు. ఇతడు చట్టప్రకారం ఒక వారసుని దత్తు చేసుకున్నా బ్రిటిషువారు దీనిని అంగీకరించలేదు. కలెక్టరు థాకరే చెన్నమ్మకు దీనిని ఉత్తరపూర్వకంగా తెలియజేసాడు.

చెన్నమ్మ థాకరే ఉత్తరాన్ని చూచి కోపంతో ఉగ్రురాలై "మనం దత్తు చేసుకున్నాం. ఇది మన ధర్మం. నేను బ్రతికి ఉన్నంతకాలం కిట్టూరు స్వాతంత్ర్యంగా ఉంటుంద"ని ఎలుగెత్తి చెప్పింది.

చెన్నమ్మ సమాధానాన్ని విన్న థాకరే సైన్యంతో వచ్చి కిట్టూరును ముట్టడించాడు. రాణి చెన్నమ్మ తన అనుచరులతో బ్రిటిషు సైన్యంపై బడి ధైర్యసాహసాలతో ఎదిరించి వారిని ఓడించింది. థాకరే మరణించాడు. కసి దీర్చుకోడానికి బ్రిటిషువారు సర్ అలెగ్జాండర్ కాంబెల్ నాయకత్వంతో పెద్ద సైన్యాన్ని పంపి కిట్టూరును వశపరచుకోమన్నారు.

రాణీ చెన్నమ్మకు సైన్యంలో 7,000 సైనికులు మాత్రమే ఉన్నారు. 25,000 బ్రిటిషు సైనికులను ఎదిరించడానికి ఈమె నిర్ణయించింది. రెండురోజులపాటు హోరాహోరీ తీవ్ర పోరాటం జరిగింది. పట్టినపట్టు విడవకుండా చెన్నమ్మ గాయపడిన పెద్ద పులిలా ఎదిరించింది. ఈ క్రూర యుద్ధంలో అనేకవేల మంది సైనికులు మరణించారు. వారితోపాటే చెన్నమ్మ కూడా మరణించడానికి సిద్ధపడింది. కానీ తప్పించుకుని పారిపొమ్మని ఆమె సర్దారులు సలహా ఇచ్చారు.

ఈశాన్య దిక్కు ద్వారంగుండా పారిపోవడానికి ప్రయత్నించిన రాణీ చెన్నమ్మను బ్రిటిషు సైనికులు బంధించారు. బెయిల్ హోంగల్ కోటకు తీసుకువెళ్ళి చెరలో పెట్టారు.

కిట్టూరు బ్రిటిషు వారి వశమైనందుకు విచారంతో చెన్నమ్మ దీర్ఘ కాలం జీవించలేదు. ఫిబ్రవరి 2, 1829 లో ఆమె మరణించింది. ఈ వీరవనిత జ్ఞాపకార్థం బెయిల్ హోంగల్‌లో ఈమె సమాధి నిర్మించబడింది.

## ప్రపంచంలో అతి పాత కారు



WORLD'S OLDEST CAR

ఒక స్వంతదారుడు ప్రపంచంలో అతి పురాతనమైన తన పాతకారును బెర్లిన్‌లో ట్రాఫిక్ మరియు టెక్నాలజీకి సంబంధించిన ఒక మ్యూజియమ్‌కు ఇచ్చాడు. ఇది 1833 లో తయారుచేయబడింది. బొగ్గు ఇంధనంతో జనింప చేసిన అవిరిశక్తితో నడిచే ఈ కారు గంటకు 40 మైళ్ళ వేగం పుంజుకుంటుంది.

'విన్న జ్ఞానం కన్నా, కన్న జ్ఞానం మిన్న'

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ యూరప్ మధ్యభాగంలో ఉంది. ఉత్తరాన సముద్రం, దక్షిణాన ఆల్ప్స్ పర్వతాలు తప్ప దీనికి సహజమైన ఇతర ఎల్లలు లేవు. దీని విస్తీర్ణము 2,48,587 చ కి. మీటర్లు. రెండవ ప్రపంచయుద్ధ ఫలితంగా జర్మనీ



FEDERAL REPUBLIC OF GERMANY

రెండు ప్రత్యేక రాష్ట్రాలుగా విడిపోవలసి వచ్చింది. పశ్చిమదిక్కు అర్ధభాగం ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ ప్రత్యేక లాండార్ (రాష్ట్రము)గా విభజింపబడిన ఫెడరల్ రాష్ట్రము.

చ.కి.మీ. కి 247 మంది జనాభాతో ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ యూరప్‌లో జన సాంద్రత ఎక్కువగా గల ప్రదేశము. ఇందులో నివసించే మొత్తం 61.7 మిలియను మందిలో మూడవ వంతు పెద్ద పెద్ద నగరాలలో ఒక్కొక్క దాంట్లో 1,00,000 మంది చొప్పున నివసిస్తారు. 5 శాతం మాత్రమే గ్రామాలలో నివసిస్తారు. ఫెడరల్ ప్రదేశంలో 54 శాతం వ్యవసాయ భూములు, 29 శాతం అటవీ ప్రదేశాలు.

ఫెడరల్ పార్లమెంటును బుండెస్టాగ్ (Bundestag) అంటారు. ఇదే ముఖ్యమైన లెజిస్లేటివ్ బాడీ. దీని సభ్యులు ప్రతీ నాలుగు సంవత్సరాల కొకసారి రహస్య ఓటు విధానంలో ఎన్నుకోబడతారు. బుండెస్రాట్ (Bundesrat) ఫెడరల్ విధానాలను నిర్ణయిస్తుంది. దీని ద్వారా రాష్ట్రం ఫెడరల్ శాసన నిర్మాణం అమలు చేస్తుంది.


FEDERAL PRESIDENT RICHARD von WEIZSACKER

ఫెడరల్ ప్రెసిడెంటు రాష్ట్రానికి అధిపతి. ఇతడు అయిదు సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడతాడు. ఫెడరల్ రిపబ్లిక్ అంతర్జాతీయ సంబంధాలకు ఇతడే ప్రతినిధి. బుండెస్టాగ్ ఎన్నుకున్న ఛాన్స్‌లర్‌ను ఇతడు నియమిస్తాడు.

ఫెడరల్ ప్రభుత్వంలో ఫెడరల్ ఛాన్స్‌లర్, ఫెడరల్ మంత్రివర్గం ఉంటారు. ఫెడరల్ ఛాన్స్‌లర్ ప్రభుత్వాధికారి. ఇతడే

ప్రభుత్వ పాలనా విధానాన్ని నిర్ణయిస్తాడు. ఈ నిర్ణయాల మేరకు ప్రతీ ఫెడరల్ మంత్రి తన మంత్రి వర్గానికి సంబంధించిన విషయాలకు బాధ్యత వహిస్తారు.

వివిధ న్యాయాధికారులు న్యాయ విచారణ సలుపుతారు. ఫెడరల్ రాజ్యాంగ విధానం ఫెడరల్ కాన్‌స్టిట్యూషనల్ కోర్టును నియమిస్తుంది.



FEDERAL CHANCELLOR
HELMUT KOHL

ప్రతీ రాష్ట్రానికి వేరు వేరు పార్లమెంటు మరియు పాలన ఉంటుంది. వీరు సాంస్కృతిక విధానం, విద్య, న్యాయ మరియు చెర పాల నిర్వహణ చేపడతారు.

మొత్తం 61.7 మిలియను జనాభాలో వ్యవసాయరంగంలోను, పారిశ్రామిక ఉత్పాదన రంగంలోను, వ్యాపార మరియు ట్రాన్స్‌పోర్టు, ఇతర రంగాలలో 25.8 మిలియను మంది మంచి ఉద్యోగాలలో ఉన్నారు. సుమారు 2 మిలియను విదేశీయులు ఫెడరల్ రిపబ్లిక్‌లో ఉద్యోగులుగా ఉన్నారు.

ఫెడరల్ రిపబ్లిక్‌లో మూడు కుటుంబాలలో ఒక కుటుంబం తన స్వంత ఇంట్లో నివసిస్తుంది. ప్రతీ 100 స్వంత ఇండ్లవారిలో 85 మందికి స్వంత కార్లు ఉంటాయి.

ఫెడరల్ రిపబ్లిక్‌లో సాలీనా జాతీయ ఉత్పాదనలో మూడవ వంతు సమాజ సంక్షే



మానికి ఉపయోగపడుతుంది. ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో 6 మొదలు 18 సంవత్సరాలవరకు బాలబాలికలకు విద్య నిర్బంధము.

(సశేషం)

## సాలీనా 500 మొదలు 1000 వరకు సస్య మరియు జంతు జాతులు నశించి పోతున్నాయి

ప్రతీ సంవత్సరం వ్యవసాయ కార్యకలాపాలు, గ్రామీణాభివృద్ధి కార్యకలాపాలు మరియు లాగింగ్ (Logging) వల్ల మొత్తం 56 దేశాలలో 27 మిలియను ఎకరాల విస్తీర్ణం గల అడవులు నశించిపోతున్నాయి. సాలీనా 500 మొదలు 1000 సస్య మరియు జంతు జాతులు (Plant and animal species) నశించిపోతున్నాయి. వెయ్యి మిలియనుకు పైబడ్డ జనానికి నష్టం ఏర్పడుతూంది.

—'ప్లెయిన్‌ట్రూత్' సౌజన్యంతో

స్వామి శ్రద్ధానంద (1856-1926) :

బెనారస్‌లో విద్యను అభ్యసించాడు. ఇతడు 1902 లో న్యాయవాద వృత్తిని వదలుకుని ఉత్తరప్రదేశ్ హరిద్వార్‌లో విద్యార్థులలో ముఖ్యంగా జాతీయాభిమానాన్ని కలిగించడానికి సుప్రసిద్ధ గురుకుల విద్యా పీఠాన్ని నెలకొల్పాడు. కుల మత భేదాలను, బాల్య వివాహాలను నిరసించి సాంఘికాభి వృద్ధిని చేపట్టిన గొప్ప సంఘ సంస్కర్త. ఇతడు మిక్కిలి శ్రద్ధతో, ఉత్సాహంతో హరిజన సంక్షేమానికి పూనుకుని ఢిల్లీలో దళిత్ ఉద్ధార్ సభను ఏర్పాటు చేసాడు. ఇతర మతములలో చేరిపోయిన హరిజనులను 'శుద్ధి' ఉద్యమం ద్వారా తిరిగి హిందూ మతంలో చేర్చుకుని, వారికి అస్పృశ్యతను తొలగించి కాపాడాడు.

* * *

రిచర్డ్ ఎవిలిన్ బైర్డ్ (1888-1957) :
(Richard Evelyn Byrd)

వైమానిక మరియు ధృవాన్వేషణ రంగంలో మార్గదర్శకుడు. మే 9, 1926 న ఇతడు మరియు ఇతడి పైలట్ ఫ్లాయిడ్ బెన్నెట్ ప్రప్రథమంగా ఉత్తర ధృవం మీదుగా విమాన ప్రయాణం చేసారు. న్యూయార్క్ నుండి పారిస్‌కు అట్లాంటిక్ మీదుగా మొట్టమొదట 360 కి.గ్రా. 'ఎయిర్ మెయిల్' ఉత్తరాలను చేరవేసాడు. 1929 నవంబరులో మరి ముగ్గురి సహాయంతో బైర్డ్ దక్షిణ ధృవం మీదుగా ప్రయాణం చేసాడు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఆపరేషన్ హైజంప్‌ను లేవదీసి 4,700 మందితో 13 ఓడలతో అంటార్కిటిక్ విస్తృత పరిశోధన చేసాడు.

* * *

మధుసూదన్ దాస్ :

ఆధునిక ఒరిస్సా నిర్మాత. ఇతడి సాహ సోద్యమంవల్ల నే 1936 లో ఒరిస్సా గవర్నర్ పాలిత రాష్ట్రంగా ఏర్పడింది. కులతత్వాన్ని నిషేధించి స్త్రీల విద్యాభివృద్ధికి ఉద్యమం సాగించి హరిజనోద్ధరణను చేపట్టిన జాతీ యాభిలాషి.

* * *

ఆర్థర్ షొపెన్‌హూవర్:
(Arthur Schopenhauer)

సుప్రసిద్ధ జర్మన్ తాత్వికుడు. ఇతడు 30 సంవత్సరముల వయసులో రచించిన "ది వరల్డ్ ఏస్ విల్ అండ్ ఐడియా" (The World as will and Idea) అనే సుప్రసిద్ధ గ్రంథము 1819 లో ప్రచురింప బడింది. మానవునిలో కేవలం జీవించాలనే ఆశగాని, వివేకంతో నడుచుకోవడం లేదని ఇతడి అభిప్రాయం. చరిత్ర ఒకే రకం కష్టాలను తిరిగి సృష్టిస్తుందని, మానవ ప్రకృతిని మార్చుటకు వీలులేదని విశ్వ సించాడు. బౌద్ధ మరియు హిందూ తత్వా లను ఆధారంగా ఇతడి తత్వము అభివృద్ధి పొందింది.



సీతా రవిచంద్రన్

ప్రాణవులు తమ మనస్సులో ఉద్భవించిన వివిధ అభిప్రాయాలను ఇతరులకు తెలియ జేసుకోడానికి ఏర్పరచుకున్న సంకేత సాధనము భాష. ఆయా దేశాలకు ఆయా భాషలుంటాయి. మన దేశంలో మాత్రం తమిళం, మలయాళము, కన్నడం, తెలుగు, హిందీ, ఉర్దూ, ఒరియా, మరాటీ, గుజరాతీ, బెంగాలీ, అస్సామీ మొదలైన భాషలు అనేకం ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో జనం మాట్లాడుకునే భాష ఆంధ్రం. దీనినే తెలుగు, తెనుగు అని కూడా వ్యవహరిస్తూంటారు ఈ మూడు పదాలు భాష, జాతి, దేశపరంగా కూడా వాడ బడుతున్నాయి.

తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాష. ద్రావిడ భాషా కుటుంబంలో తమిళం, మలయాళము, కోత, తొద, కొడగు, కన్నడం, తుళు, తెలుగు, గోండీ, కొండ, పెంగొ, మండ, కూయి, కువి, కోలామీ, నాయకీ, పర్జీ, గదబ, కూడుఖ్, మాల్తో, బ్రాహూయీ అనే ఇరవై యొక్క భాషలున్నాయి. ఈ పై వరుసలో తమిళం మంచి తుళుదాకా దక్షిణ ద్రావిడము, తెలుగు మంచి గదబదాకా మధ్యద్రావిడము, చివరి మూడు ఉత్తర ద్రావిడము అని మూడు ఉప భాషా కుటుంబాలుగా విభజింపబడ్డాయి.

ఐతరేయ బ్రాహ్మణంలో ఒక కథ ప్రకారం ఆర్య ఆంధ్రులు వారి సంఘము నుండి బహిష్కరింపబడి ఉత్తర ఆర్యావర్తం నుంచి వింధ్య దక్షిణాపథానికి వచ్చారని తెలు స్తూంది. వీరు క్రమక్రమంగా కృష్ణా, గోదా వరీ ప్రాంతాలలో తెలుగులతో చేరి ఆంధ్ర రాజ్యం స్థాపించారు. క్రీ.పూ. 3వ శతాబ్దం తరువాత వీరు మగధను ఆక్రమించి సామ్రా జ్యాధిపతులైనారు.

ఈ విధంగా ఆంధ్రులు కృష్ణా గోదావరి వాసులై అక్కడి వారితో కలసి పాలకు లైనారు. ఆ దేశమే ఆంధ్రదేశము. అక్కడి

## 1988 మిస్ యూనివర్స్




థాయ్‌లాండ్‌కు చెందిన 19 సం. ల యువతి పోర్న్‌టిప్ నఖిరున్‌కనోక్ (Porntip Nakhırunkanok) అనే సుందరి తైవాన్ తెయ్‌పెలో 1988 వ సంవత్సరం మిస్ యూనివర్స్‌గా ఎన్నుకోబడింది.

"ధర్మముతో సంబంధం లేని అర్థ కామములు అనర్థ హేతువులు."

జనులు ఆంధ్రులు. వారి భాష ఆంధ్రభాష. సమాజంలో వీరు దక్షిణ ప్రాంతంనుంచి వచ్చారు కాబట్టి వారిని తెనుంగులు అని నిర్ణయింపబడి ఉండవచ్చు. వీరి భాష తెనుగు లేక తెనుంగు తెనుగు దేశ్యమైన దిగ్వాచి. తెలుగు శబ్దం తెనుగు శబ్దానికి రూపాంతరము.

మొట్టమొదట నన్నెచోడుడు, నన్నయ తెనుగు పదాన్ని భాషాపరంగా వాడారు. తరువాత పాలకురికి సోమన తెలుగు, తెనుంగు పదాలను భాషా పరంగా ప్రయోగించాడు. తరువాత తిక్కన తెలుగు కవిత్వము, తెలుగు బడి, తెనుంగు బాస, తెనుగుబాస అనే పదాలు ప్రయోగించాడు. ఆంధ్రశబ్దము జాతి, దేశ భాషలను సూచించడానికి వాడబడుతూంది.

తెలుగులో సంస్కృతంలో కంటే మరి కొన్ని అక్షరాలు అధికంగా ఉన్నాయి. తెలుగు భాష అక్షర సమామ్నాయం సర్వ సమగ్రంగా ఉంటుంది. ఇంత విపులమైన వర్ణమాల ఇతర భాషలకు లేదు. ఉచ్చారణకు తగినట్టుగా తెలుగులో వ్రాయగలరు. అరవ భాషకు ఈ సౌలభ్యం లేదు. అరవంలో ఒకే అక్షరాన్ని వివిధ రకాలుగా ఉచ్చరించవచ్చు.

అరవ భాషలో క, ఖ, గ, ఘ లు అన్నీ 'క' తోను, అదేవిధంగా ట, ఠ, డ, ఢ లు ట తోను, ప, ఫ, బ, భ లు 'ప' తోను సూచిస్తారు. ఇదేవిధంగా ఇతర వర్ణాక్షరాలు కూడా సూచింపబడుతున్నాయి. కాని తెలుగు భాషకు ప్రత్యేకమైన అనుకూలత ఉంది. ప్రత్యేకమైన మాధుర్యత ఉంది. అందుకే వివిధ సాహిత్య ప్రక్రియలు ఏర్పడ్డాయి.

తెలుగు అజంత భాష. తక్కిన దాక్షిణాత్య భాష లన్నిటికంటే మొట్టమొదట అచ్చుల ప్రాధాన్యం అధికంగా సంతరించుకుంది. సంయుక్త వర్ణాలను వియుక్తం చేసుకుంది. పదాంతంలో వచ్చే 'న' కార 'ల' కారాలు చాలా మృదువైనవి. అందువల్లనే దాని కంఠ మాధుర్యం. ఇతర భాషలు అజంతములు కావు. హలంతములు. అందు

## హాస్యభావము



రంగురంగులతో వికసించిన సుగంధ పుష్పాలకు సూర్యరశ్మి చైతన్యత కలిగించినట్లే మానవులకు చిరునవ్వులు ఉత్సాహాన్ని కలిగిస్తాయి. అత్యల్పంగా కనిపించినా జీవిత పథంలో వీటి విలువ అమూల్యం, ఊహాతీతం. అమాయకత్వంతో కూడిన చిరుహాసం సౌందర్యాన్ని ఆకర్షవంతం చేస్తుంది, విజ్ఞానాన్ని రంజింపచేస్తుంది, సామరస్యాన్ని, సౌజన్యాన్ని పెంపొందిస్తుంది. ఆరోగ్యాభివృద్ధితో ఆయువును పెంచుతుంది. దారిద్ర్యాన్ని, కష్టాన్ని తీరుస్తుంది. అజ్ఞానానికి నిష్కాపట్యమైన సరళత్వాన్ని ఆపాదిస్తుంది. అందవికారంలో సౌందర్యాన్ని ప్రతిబింబిస్తుంది.

—అడిసన్

"పూర్వాపరాలకు సామంజస్యం కుదిరినప్పుడే అన్వయం ఏర్పడుతుంది."

కనే ఇతర భాషలకు లేని తీయదనం తెలుగుకు ఏర్పడింది.

'దేశభాషలందు తెలుగు లెస్స' అని కవి సార్వభౌముల ప్రశంసను గాంచి రాణించిన భాష తెలుగు భాష. శ్రీనాథ మహాకవి పొగడిన భాష ఇది. పాశ్చాత్యులు తెలుగు భాషను 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని ప్రశంసించారు. పశ్చిమ దేశాలలో ఇటాలియన్ ఎంత గొప్పదో తూర్పున తెలుగు అంత గొప్పది.

తెలుగుభాష తేనెలైన, రమ్యమైన భాష. కర్ణాటక సంగీతానికి తెలుగువారి గొప్ప కానుక తెలుగుభాష. దానికి సంగీతంలో నాదాన్ని పుట్టించే శక్తి ఉంది. ఇది అచ్చులకే ఉంది. హల్లులకు లేదు. కాబట్టి అచ్చు ప్రాధాన్యమైన తెలుగుభాష తక్కిన ద్రావిడ భాష లన్నిటికన్న సంగీతంలో వ్యాప్తిని, వర్చస్సును పొందింది. ప్రారంభం నుంచీ సంగీతకళలో తెలుగువారు ఎక్కువగా శ్రమించారు. విజయనగరం, తంజావూరు. మధుర, పుదుక్కోట మొదలైన రాజుల ఆస్థానాలలో తెలుగు వాగ్గేయకారులు ప్రవేశించి తమ రచనలకు వ్యాప్తి తెచ్చారు. దీనివల్ల కర్ణాటక సంగీత కళలో తెలుగు భాషకు సాంప్రదాయకమైన ప్రబలస్థానం ఏర్పడింది. తమిళులు, కన్నడులు, మలయాళీలు తెలుగు నేర్చుకుని తెలుగులో కీర్తనలు సాగించారు.

సంస్కృత భాషా సొంపుతో, పాశ్చాత్య భాషా వాసనలతో, పొరుగు భాషల అతిశయంతో, మాండలిక మాధుర్యంతో మిక్కిలి సొంపుగా, ఇంపుగా దినదినాభివృద్ధి పొందుతూన్న భాష తెలుగుభాష.

## నేల కడగడానికి, పాలిష్ చేయడానికి రాబోటులు

జపానులో తోషిబా కార్పొరేషన్ మరియు మిట్సుయ్ రియల్ ఎస్టేట్ డెవలప్‌మెంట్ కంపెనీ లిమిటెడ్‌వారు చేరి ఉమ్మడిగా అభివృద్ధి చేసిన రాబోటు దానంతట అదే తిరుగుతూ నేలమీది దుమ్మును తుడిచేస్తుంది. నేల కడిగి బాగా పాలిష్ చేస్తుంది. దారిలో ఏదైనా అడ్డుతగిలితే దానిపై ఉండే సెన్సార్ కనిపెడుతుంది. రాబోట్ దానంతటదే ఆగిపోతుంది. ఇటువంటి రాబోటులకు మనుష్యులు తుడిచే దానికి పట్టే కాలంలో పదో వంతు కాలమే పడుతుంది.

— 'జపాన్‌టుడే' సౌజన్యంతో

## మెరుపువల్ల 10,000 అగ్ని ప్రమాదాలు



యుఎస్ఎలో వేసవిలో మెరుపువల్ల 10,000 అగ్నిప్రమాదాలు ఏర్పడుతున్నాయి.

రూపా దేశాయ్

రావిచెట్లవంటి ఒకరకం చెట్లే 'మాన్‌గ్రోవ్' చెట్లు. వివిధ వృక్ష కుటుంబాలకు చెందిన ఈ విచిత్ర జాతిచెట్లు ఉష్ణ ప్రదేశపు సముద్ర తీరాల బురదనేలలో వర్ధిల్లుతున్నాయి. ఇటువంటి బురద ప్రదేశాలలో సాధారణంగా ఇతర చెట్లు ఏవీ పెరుగవు.


MANGROVE PLANT

భారతదేశంలో మాన్‌గ్రోవ్ చెట్లతో నిండిన తీరరేఖ సుమారు 380 కిలోమీటర్ల పొడవు ఉంది. ఇది మొత్తం తీరరేఖలో 8 శాతం. పశ్చిమబెంగాల్, ఒరిస్సా, ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాత్, అండమాను, నికోబార్ తీరరేఖలో మాన్‌గ్రోవ్‌లు విస్తారంగా కనిపిస్తాయి.

తీరప్రదేశం నీటి ప్రవాహానికి కొట్టుకుపోకుండా రక్షించడమే కాకుండా అనేక రకాల చేపలు, ఇతర జలచరాలు గ్రుడ్లు పెట్టుకోడానికి అనువైన ప్రదేశాన్ని ఈ చెట్లు కల్పిస్తున్నాయి. ఈ మాన్‌గ్రోవ్‌ల ఆకులు, కొమ్మలు వల్ల లభించే పోషక పదార్థాలు అనేక జలచరాలకు ఆహారం. అంతేగాక ఇవి తీర ప్రదేశాలలో మత్స్య పరిశ్రమకు కూడా తోడ్పడతాయి.

భారతదేశంలో కొన్ని మాన్‌గ్రోవ్ ప్రదేశాలలో సాంక్చురీలు ఏర్పాటుచేసారు. వీటిలో ముఖ్యమైనవి గుజరాత్‌లో గల్ఫ్ ఆఫ్‌కచ్ మెరైన్ నేషనల్ పార్కు, పశ్చిమ బెంగాల్‌లో సుందర్‌బాన్స్. మాన్‌గ్రోవ్‌లు క్రమక్రమంగా నశించిపోతున్నాయి. పశువులకు మేతగాను, వంటచెరకు ఉపయోగానికి ఈ చెట్లు కొట్టివేస్తూండడంవల్ల ఈ విపరీత పరిస్థితి ఏర్పడింది.

మాన్‌గ్రోవులవల్ల పశువుల ఆహారం, వంటచెరకు, కలప మొదలైనవి నిరంతరం లభిస్తాయి. కొన్ని మాన్‌గ్రోవ్ రకాలనుండి టానిన్ (Tanin) తయారు చేయబడుతుంది.

తీరప్రదేశాలలో ఉండే మాన్‌గ్రోవ్‌లు నేడు సగానికి సగం నశించిపోయాయి. వెంటనే సంరక్షణకు తగిన సక్రమ చర్యలు చేపట్టకపోతే ఇవి పూర్తిగా నశించిపోతాయి.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద చర్చి ఆర్గన్

ప్రపంచంలో మిక్కిలి పెద్ద చర్చి ఆర్గన్ (వాద్యవిశేషం) పశ్చిమ జర్మనీ పాసావ్‌లోని సెంట్ స్టీఫెన్స్ హాస్పిటల్‌లో ఉంది. ఈ అపూర్వ వాద్యానికి 17,428 గొట్టాలున్నాయి.

"ప్రేమ కుసుమముకంటె కోమలము, వజ్రముకంటె [illegible]"
—[illegible]

# జిడ్డు కృష్ణమూర్తి

జిడ్డు కృష్ణమూర్తి ఆంధ్రప్రదేశ్ మదనపల్లిలో మే 11, 1895 లో జన్మించాడు. ఇతడు బాల్యంలోనే కులమత భేదం లేకుండా అందరితో చేరి తిరుగుతూ తన బట్టలను, ఆహారాన్ని వారితో పంచుకుని ఉదార స్వభావాన్ని ప్రకటించాడు.


J KRISHNAMURTI

సుమారు 14 సంవత్సరాల వయస్సులో దివ్యజ్ఞాన సమాజానికి చెందిన డా. అనిబి సెంట్ ఇతడి గొప్పదనాన్ని గ్రహించి అతడిని చేరదీసింది. కృష్ణమూర్తి, అతని తమ్ముడు నిత్యానందం దివ్యజ్ఞాన సమాజంలో జీవితం గడుపుతూ విద్యను అభ్యసించారు. నిష్ఠ నియమములు గలిగిన పవిత్ర భారతీయ కుటుంబంలో వీరు ఆర్జించిన ఆధ్యాత్మిక విజ్ఞానానికి ఇది తోడైంది. 1911 లో భక్తులు ఇతనిని 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఆఫ్ ది ఈస్ట్'కు నాయకునిగా ప్రకటించారు.

ఆగస్టు 1921 లో 28 సంవత్సరాల ప్రాయంలో కృష్ణమూర్తి ధ్యాన సాధన ప్రారంభించాడు ఐదురోజుల తరువాత మెడ వెనుకభాగంలో ఒక కంతిలం ఉబ్బి తీవ్రమైన బాధ అనుభవించాడు. మరునాడు స్పృహ తప్పి పడిపోయాడు. కలతచెంది మూలగడం ప్రారంభించాడు. అపూర్వమైన సమాధి స్థితిలో ఎంత చిన్న శబ్దానికైనా తత్తరపడి పోయేవాడు. ఒకరోజు సాయంకాలం దివ్యానుభూతిలోకి ప్రవేశించాడు. ఒక విధ

## 'విస్డమ్' పాతకాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ అక్టోబరు '85; జనవరి '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87 నుంచీ డిసెంబరు '87; జనవరి '88 నుంచీ జూన్ '88 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీ వెల పై 0.75లు; 1984 కాపీల వెల రూ. 8.75 లు; 1985 కాపీల వెల రూ 11.50 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీల వెల రూ. 10.00 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5-00 లు చేర్చి M. O. పంపాలి. 'విస్డమ్', 9. దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

'ఒక దశలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్న వ్యక్తులు, మరోదశలో మరుగునపడిపోవడం ప్రపంచానికి వింత?'

మైన ప్రశాంతిని పొందాడు. అతడిలో సత్య స్వరూపం ప్రకాశించింది. అజ్ఞానపు చీకటులు తొలగిపోయాయి. దివ్యానందానుభవంలో అక్షయమైన శాశ్వత సౌందర్యం ప్రత్యక్షమైంది. ఈ అపూర్వ అనుభవం అతడి జీవితాన్నే మార్చివేసింది.

సిద్ధాంతాలను, ఆచారాలను వివేక దృష్టితో విచారించడం ప్రారంభించాడు. దివ్యజ్ఞాన సమాజపు కార్యక్రమాలను, లక్ష్యాలను గురించి ప్రశ్నించడం మొదలుపెట్టాడు. 1929 లో 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఆఫ్ ది ఈస్ట్'ను వదలి దివ్యజ్ఞాన సమాజం నుంచి విడిపోయాడు. తన స్వంత సిద్ధాంతాన్ని ప్రచారం చేయడం ప్రారంభించి ఆమరణాంతం కొనసాగించాడు.

1926 మొదలు 1931 వరకు ఇతడు ఆంగ్లంలో 60 పద్యాలను రచించాడు. 1928 నుండి ప్రపంచం అంతటా అనేకచోట్ల లెక్కలేనన్ని ఉపన్యాసాలు ఇచ్చాడు. అనేక గ్రంథాలు ప్రకటించాడు. ఎనిమిది పాఠశాలలను ఏర్పరచాడు. ఇతడిని గురించి తెలిసిన వారు, దగ్గర ఉన్నవారు కూడా ఇతడి గ్రాహకశక్తి, భావ ప్రకాశము 1921 అనుభవం తరువాత పూర్తిగా మారిపోయాయని అంటారు.

బాల్యంనుండి కృష్ణమూర్తికి యోగదృష్టి, అతీంద్రియ దృష్టి, మరణించిన వారిని చూడడం వంటి గొప్ప గొప్ప శక్తులు ఉండేవి. కాని ఈ అతీంద్రియశక్తిని ఇతడు అభ్యసించలేదు. ఇవి అసలైన ఆధ్యాత్మిక అభివృద్ధికి ఆటంకాలని అతడి అభిప్రాయం. మానసిక శక్తులకంటే ఆత్మాభివృద్ధే ముఖ్యమని చెప్పేవాడు.

ఇతడు అభిమానుల, ప్రేక్షకుల యొక్క సందేహాలను, విమర్శలను అతి చాకచక్యంగా తీర్చిదిద్దేవాడు. ఇతడు నిగర్వి, గౌరవ మర్యాదలను పాటించేవాడు. మనోజ్ఞత సౌందర్యము కలవాడు. పూర్ణ మానవత్వమును పొందినవాడు. ఇతడి దృష్టిలో, మాటలో ఆకర్షణ ఉందని, ఒక్కొక్కప్పుడు ఇతడిలో ఒక దివ్య తేజస్సు ప్రకాశిస్తూంటుందని చాలామంది చెబుతారు.

ఆత్మకు మరణంలేదని ఇతడి నమ్మకము. మరణం అంటే భయపడేవాడు కాదు. మానవుడు తన జీవిత సంఘర్షణనుండి తప్పించుకోడానికి అనేక పద్ధతులను

(మిగతా 24 వ పేజీలో)

## ఐర్లండు దేశస్థులు 'టీ' అత్యధికంగా త్రాగుతారు



ప్రపంచంలో ఇతర దేశాలలో నివసించే వారి అందరికంటే ఐర్లాండులో నివసించే ప్రజలు తలసరి అత్యధికంగా టీ త్రాగుతారు.

స్కాట్లండ్‌యార్డ్ థేమ్సునదీ తీరాన ఉన్న మెట్రోపాలిటన్ లండన్ పోలీస్ హెడ్‌క్వార్టర్స్. ఈ పోలీసు పిద్వంది 1617 చ.కి.మీ.ల వైశాల్యంగల గ్రేటర్ లండన్‌లో నివసించే 9 మిలియను మందికి రక్షణ సౌకర్యాలు కలిగిస్తారు. వైట్ హాల్ దగ్గర ఉండే ఒక ప్రదేశాన్నుంచే ఈ పేరు దీనికి సార్థకమైంది.

18 000 మంది ఆడ, మగ పోలీసు అధికారులు కమిషనర్ హయాంలో ఉంటారు. ఇక్కడే రాత్రి పగలు పని చేస్తూండే ఇన్‌ఫర్‌మేషన్ రూమ్ కూడా ఉంది. లండన్‌లో పోలీసువారికి సంబంధించిన ప్రతీ సమాచారం టెలిఫోను మరియు రేడియో సహాయంతో కొద్ది సెకండ్లలో వీరికి అందుతుంది.

స్కాట్లండ్‌యార్డ్ మోసగాళ్ళను, దొంగలను పట్టుకుంటుంది. క్రిమినల్ రికార్డు ఆఫీసులో ప్రతీ నేరస్థుని పేరు జాబితాలో వ్రాయబడి ఉంటుంది. నేరస్థుని ఎత్తు, ఆకారం, జుట్టు మరియు కళ్ళరంగు, నేరంచేసే విధానం మొదలైన వివరాలన్నీ వ్రాయబడి ఉంటాయి. క్రిమినల్ రికార్డ్ ఆఫీసులో ప్రతి సంవత్సరం సుమారు 1,00,000 మంది నేరస్థుల రికార్డులు తయారవుతాయి. దేశంలో వివిధ పోలీసు అధికారులు వీటిని ఉపయోగించుకుంటారు.

స్కాట్లండ్‌యార్డ్‌కు ఒక మాప్ రూమ్ కూడా ఉంది. ఇక్కడ పెద్ద పెద్ద లండన్ మాపులు తగిలించి ఉంటాయి. కొన్ని మాపులలో ప్రతీ వీధి, ఇల్లు గుర్తించబడి ఉంటుంది. ప్రతీ రోజూ ఉదయం 8 గంటలకు తయారుచేసే మాప్‌లో లండన్‌లో జరిగిన నేరాలు పిన్నుతో గుచ్చిన చిన్న చిన్న రంగుజండాలతో సూచింపబడతాయి. ఏరోజు కారోజు ట్రాఫిక్ మాప్‌లో అపాయకరమైన ప్రదేశాలు సూచింపబడతాయి.

సుమారు 125 సంవత్సరాలకు పూర్వం ప్రారంభించిన ఈ పోలీసు ఉద్యమం ప్రపంచంలో మిక్కిలి విజ్ఞానాత్మకంగాను, సునిశితంగాను స్కాట్లండ్‌యార్డ్ నిర్వహిస్తూంది.

## ప్రపంచంలో అతి పెద్ద విత్తనం



COCONUT

ప్రపంచంలో మిక్కిలి పెద్ద విత్తనం జంట కొబ్బరికాయలలో ఉండే ఏక బీజ విత్తనం 40 పౌనులు తూగుతుంది. ఇది హిందూ మహాసముద్రంలో సెకెలెస్ ద్వీపాలలో పెరుగుతుంది.

"సత్యానికి సన్నిహితంగా ఉంటే సంతోషం వెల్లివిరుస్తుంది."

డా. క్రిస్టియన్ బార్‌నార్డ్, సి. ఎన్. కోడ్,
పార్కిన్‌సన్, ఎమ్. కె. రుస్తుంజీ

శ్దం-ఎడ తెగకుండా నిరంతరం ఏర్పడే శబ్ద మైనా, విడిచి విడిచి అప్పుడప్పుడు కలిగే శబ్దమైనా మానవుని శరీరంలో ఒత్తిడి స్థాయిని అధిక పరుస్తుందని నిరూపించబడింది.

రాకపోకల బళ్ళు, వాహనాలు, విమానాలు, మెషీనులు వగైరాలవల్ల కలిగే శబ్దం, లౌడ్‌స్పీకర్ల సందడి మొదలైనవి చాలా ప్రమాదకరం. ఆరోగ్యానికి భంగం కలిగిస్తాయి. దీనిని రుజువుచేయడానికి కావలసిన నిదర్శనాలు ఉన్నాయి. విమానాల హోరు అధికంగా ఉండే హీత్రో ఎయిర్‌పోర్టు పరిసర ప్రదేశాలలో నివసించేవారే చాలామంది మెంటల్ హాస్పిటలులో చేరుతున్నారని లండన్ మనస్తత్వ శాస్త్రజ్ఞులు ప్రచురించిన లెక్కలనుబట్టి తెలుస్తోంది. విమానాల హోరు మరియు ఇటువంటి శబ్దంవల్ల వ్యక్తి నిద్ర చెడిపోతుంది.

ఇటీవల క్రొత్తగా తెలుసుకున్న శబ్ద కాలుష్యం 'ఇన్‌ఫ్రాసౌండ్' (infrasound). సాధారణంగా మానవుల చెవులకు అసలు ఏ మాత్రం వినిపించని అతి హీనమైన పౌనఃపున్యపు శబ్దతరంగాలవల్ల ఏర్పడే శబ్దం ఇన్‌ఫ్రాసౌండు. కంప్రెసర్ వంటి మెషీనులు తిరిగేటప్పుడు ఇన్‌ఫ్రాసోనిక్ శబ్దం బయలుదేరుతుంది పెద్ద పెద్ద భవనాలలోను ఫాక్టరీలలోను, ఆఫీసులలోను, హాస్పిటళ్ళలోను వినిపించే ఒక విధమైన హోరు, సద్దువల్ల ఏదో రోగంతో పీడింపబడి ఊపిరి తీసుకోవడం కష్టం అనిపిస్తుంది. కొంతమందిలో కనిపించే విసుగు, చిరాకు, కోపము మొదలైనవన్నీ ఇన్‌ఫ్రాసౌండ్ వల్ల కలిగినవేనని వైద్యులు అభిప్రాయపడుతున్నారు.

శబ్దాన్ని కొలవవచ్చు. పెద్ద ఘోష 110 డెసిబిల్స్ ఉంటుంది. డిస్కో డాన్సులో జనించే శబ్దం ఈ పరిమాణంలోనే ఉంటుంది.

(మిగతా 28 వ పేజీలో)

## ప్రపంచంలో అమూల్యమైన చిత్తరువు




లియోనార్డో డా విన్సి చిత్రించిన మోనాలిసా ప్రపంచంలో మిక్కిలి విలువగల చిత్రం. ఇది ఇటలీ ఫ్లారెన్స్‌లోని ఫ్రాన్సిస్కో డెల్ గియోకాండో భార్య అయిన మొనాన్నా లిసా గెరార్డిని చిత్తరువు. ఇప్పుడు దీని వెల 35.7 మిలియన్ పౌండ్లు.

"అధికారంమీద అనవసరమైన భ్రమలు పెట్టుకోడం పొరపాటు."

## ప్రొ. నిర్మల్ చంద్

ప్రపంచం అంతా ఒక బ్రహ్మాండమైన పెద్ద ఇల్లు. వివిధ దేశాలు బ్రహ్మాండమైన ఆ పెద్దఇంట్లో గదులు వంటివి. ప్రపంచంలో నివసించేవారందరు ఒకే కుటుంబానికి చెందినవారు. సంకుచిత సరిహద్దులను ఏర్పరచుకుని, విభాగాలు చేసుకుని జీవించడం శరీరంలో అంగ విభజన చేయడం వంటిది. తూర్పు, పశ్చిమాలు రెండూ సమిష్టిగా ఒకే ఒక పరిపూర్ణ స్వరూపానికి చెందినవి. పరస్పర సహకారము, సహాయము, అవగాహన లేకుండా ఏ ఒక్కరూ విడిగా ప్రవృద్ధిపొందలేరు.

ప్రాక్పశ్చిమ సాంస్కృతిక సమైక్యతతో రెండూ చేరి ఉంటే సౌఖ్యదాయకం. సాంకేతిక పరిధిలో, ప్రాపంచిక విజ్ఞానంలో పశ్చిమదేశాలు ఎంతో ప్రగతిని పొంది ఉన్నాయి. తూర్పుదేశాలు ఆధ్యాత్మిక విజ్ఞానంతో పారమార్థిక ప్రగతిని పొంది ఉన్నాయి.

ఆధ్యాత్మిక ప్రగతితో పాటు ధార్మికాభివృద్ధిని కూడా మనం పెంపొందించుకోవాలి. కాబట్టి మనం దీంతో సుఖమయ జీవనాన్ని సాగిద్దాం.

ప్రపంచంలో అన్నిదేశాలు పరస్పర ప్రేమాభిమానాలతో ప్రవృద్ధి పొందాలని ఆశిద్దాం. స్వలాభాన్ని మానుకుందాము. 'నీవు జీవిస్తూ ఇతరులను బ్రతకనిమ్ము' అనే సూత్రాన్ని అనుసరిద్దాం. ప్రపంచ ప్రభుత్వాలు అన్నీ ఏకమై పరస్పర శాంతి సామరస్యాలను పెంచుకుంటే 'వసుధైక కుటుంబం' అనే కల వాస్తవం అవుతుంది.

### 2020 సంవత్సరం నాటికి 8000 మిలియను జనాభా



ప్రపంచంలో మొట్టమొదట నాగరికత ప్రారంభమైన నాటినుంచి 1850 సంవత్సరానికి జనాభా ఒక బిలియను (1000 మిలియనుకు) పెరిగింది. తరువాత 80 సంవత్సరాలకు అంటే 1930 కి అది రెట్టింపు 2 బిలియను (2000 మిలియను)కు పెరిగింది. తరువాత సుమారు 57 సంవత్సరాలకు 1987కి ప్రపంచంలో 5 బిలియను (5000 మిలియను) మంది ఉన్నారు. 2020 సం.రం నాటికి ఈ జనాభా 8 బిలియను (8000 మిలియను) మందికి పైగా ఉంటుంది.

— 'ప్లెయిన్ట్రూత్' సౌజన్యంతో

### యునైటెడ్ స్టేట్స్‌లో 168 మిలియను టెలిఫోనులు:

యునైటెడ్ స్టేట్స్‌లో 168 మిలియను టెలిఫోనులు ఉన్నాయి. ప్రతీ 100 కుటుంబా



లలో 96 కుటుంబాలకు టెలిఫోను సౌకర్యం ఉంది.

*   *   *

### వాయువిమానం రెక్కలకు అల్యూమినియం ఉపయోగిస్తారు:

వాయువిమానం రెక్కలకు ఉపయోగించే ప్రత్యేకరకం అల్యూమినియం చాలా దిట్టంగా 6 చ.సెం.మీ.లకు 40,824 కిలోల భారాన్ని భరించగలిగి ఉంటుంది.

*   *   *

### కోకిల తన గూడు కట్టుకోదు:

కోకిల పక్షి ఎప్పుడు తన గూడును తాను నిర్మించుకోదు.

*   *   *

### జపానులో జనరల్‌కి 20 అంగుళాల పొడవు గల మీసాలు:

జపాన్ సైన్యంలో ఒక జనరల్‌కి 20 అంగుళాల పొడవైన మీసాలు ఉండేవి. 1933 లో ఇతడు మరణించినప్పుడు ఈ మీసాలను ప్రత్యేకమైన మర్యాదలతో ఒక భరిణెలో భద్రపరచి పూడ్చిపెట్టారు.

*   *   *

## జీవించడానికి నీరు ప్రాణప్రదమైనది

నీ శరీరం మరియు నీరు గురించి కొన్ని వాస్తవాలు:

వేసవిలో 3000 చదరపు అడుగుల చర్మంలో రెండు మిలియను స్వేదగ్రంధులు నీ చర్మాన్ని తడితో చెమ్మగా ఉంచి శరీరాన్ని చల్లగా ఉంచుతాయి.

వేడి అధికంగా ఉండే రోజున రెండు లేక అంతకంటె ఎక్కువ క్వార్టుల నీరు ఊపిరితిత్తుల మరియు చర్మంద్వారా విడుదల అవుతుంది.

మానవ శరీరంలో 100 మిలియను సూక్ష్మకణాలల్లో ప్రతీదానికి నీరు అవసరం.

నీ కండరాలు 75 శాతం నీరు.

నీ ఎముకలు 50 శాతం నీరు.

నీ కిడ్నీలు వడపోత విధానము.

నీవు పూర్తిగా 50 శాతం మొదలు 85 శాతం నీరు.

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

'సత్యాన్ని గురించిన సిద్ధాంతాలు

**పచ్చ బొట్లు పొడిచే ఆర్టిస్టుకి వంటిమీద 4,831 పచ్చబొట్లు:**

కెనడాలో పచ్చబొట్లు పొడిచే ఒక చిత్రకారుని వంటినిండా 4,831 పచ్చబొట్లు ఉన్నాయి.

* * *

**విజ్ఞాన పరిశోధనాలయాలలో అపాయ సూచన పసుపు పచ్చనికాంతి:**

విజ్ఞాన పరిశోధనాలయాలలో అపాయ సూచనకు పచ్చగా ప్రకాశించే పసుపుపచ్చ కాంతిని ఉపయోగిస్తారు.

* * *

**అత్యధికంగా ప్రదర్శింపబడిన ఏకపాత్రాభినయం:**

ఆంధ్రప్రదేశ్ హైదరాబాదు నటుడు బద్బన్‌ఖాన్ అద్రాక్-కె-పాంఛే ఏకపాత్రాభినయ నాటక ప్రదర్శనలు అత్యధికంగా ఇచ్చాడు.

* * *

**పుళ్లు పదేపదే బయలుదేరడానికి ముఖ్య కారణం:**

ముఖ్యంగా పొగ త్రాగడంవల్ల పుళ్ళు (Ulcers) పదే పదే వస్తూంటాయి.

* * *

**మూత్రపిండాల మార్పిడికి ఉపయోగించే ఔషధం:**

మూత్ర పిండాల మార్పిడికి ఉపయోగించే ఔషధాన్ని 'సైక్లోస్పొరైన్' (Cyclosporine) అంటారు.

## లింకన్ జీవితంలో 'ఏడు' సంఖ్య



లింకన్ యుఎస్ఎ 16 వ ప్రెసిడెంట్. లింకన్ పేరులో (ఆంగ్లంలో) 7 అక్షరాలు ఉన్నాయి. ఇతడు 1847 డిసెంబరు 7 వ అమెరికన్ కాంగ్రెస్ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. ఇతడికి స్టీఫెన్ డగ్లస్ (Stephen Douglas రెండు మాటలు 7 అక్షరాలు)తో 7 వాదాలు అయ్యాయి. ఇతడు బానిసవృత్తి (slavery 7 అక్షరాలు) నివృత్తికై పోరాడాడు. స్టేటు లెజిస్లేచరులో ఇతడు 7 సంవత్సరాలు ఉన్నాడు. యుఎస్ఎ ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డప్పుడు ఇతడు 7 మంది కాబినెట్ మినిస్టర్లను ఎన్నుకున్నాడు. ఇతడు పదవిలో ఉండగా అమెరికానుండి 7 రాష్ట్రాలు విడిపోయాయి. ఇతడి బెస్ట్ జనరల్ యు.ఎస్. గ్రాంట్ (U.S. Grant) పేరులో 7 అక్షరాలు ఉన్నాయి. లింకన్ వారంలో 7 వ రోజున 7 గంటల తరువాత కొన్ని క్షణాలకు మరణించాడు.

[illegible] తలిసిన భాగమునే మానవుడు అనుభవించాలి."

# సింధు నాగరికత

డా. వై.ఎ. రాయ్‌కర్

ఇండస్‌లోయ నాగరికతా వశేషాలు మొదటి సారిగా (1921) హరప్పా (ఇప్పుడు పాకిస్థాన్)లో కనుగొనబడ్డాయి. పురావస్తు, శిల్ప శాస్త్రజ్ఞుల సాంప్రదాయాన్ని అనుసరించి సాంకేతిక పదాభివృద్ధికి ఈ ప్రదేశం ప్రాతిపదికగా ఎన్నుకోబడింది. కాబట్టి ఇండస్‌లోయ నాగరికత హరప్పన్ నాగరికత అంటారు.


MOHENJODARO
(THE GREAT BATH)

ప్రాచీన శిల్పశాస్త్రజ్ఞులు మెసపటేమియా (ఇప్పుడు పశ్చిమ ఆసియాలో ఇరాక్) సూమీర్ మరియు అక్కడి ప్రదేశాలను ప్రాతిపదికగా చేసుకుని సింధునాగరికత సుమారు 2500 బి సి. నుండి 1500 బి.సి. వరకు ఉందని ఊహించారు. ఇప్పుడు "కార్బను-14" పరీక్షలు వల్ల తేలిన కచ్చితమైన కాలాలవల్ల మరింత సమాచారం అందుతూంది. ఇచ్చట 16 ప్రదేశాల నుంచి సుమారు 90 రకాల బొగ్గు, అస్థులు, గుల్లలు వంటి పదార్థాలు పరిశోధింపబడ్డాయి. వీటి వల్ల హరప్పా ముందు కాలపు, సమకాలీన మరియు తరువాతి కాలపు నాగరికతలను అతి కచ్చితంగా, స్పష్టంగా, విడివిడిగా, కాలక్రమానుగతంగా తెనుసుకోడానికి వీలైంది.

ఇండస్‌వాలీ నాగరికతకు సంబంధించిన ప్రదేశాలు అథమం 790 ఇండియాలోను, 300 పాకిస్థాన్‌లోను తెలుసుకొనబడ్డాయి.

సింధు నాగరికత తూర్పు పడమరలుగా 1600 కి.మీ.లు, ఉత్తర దక్షిణాలుగా 1500 కి.మీ. లు విస్తరించుకుని ఈజిప్టు, మెసపటేమియా నాగరికతలు కలిసి ఉన్నంత పెద్ద పరిమాణంలో ఉంటుంది.

సింధు నాగరికతకు చెందిన మొహెంజొదారో మరియు హరప్పా (ఇప్పుడు పాకిస్థానులో ఉంది) ముఖ్యపట్టణాలుగా మధ్య, తూర్పు, పశ్చిమ, దక్షిణ మండలాలు ఉండి ఉండవచ్చు. రోము సామ్రాజ్యం ఏర్పడడానికి ముందు ఇది ప్రపంచంలో అతి విస్తారమైన రాజ్యాంగము.

**లక్ష్యాన్ని సాధించడమే నీ పరమావధి**

నిర్విరామమైన ఉత్సాహంతో లక్ష్యాన్ని సాధించడానికి ప్రయత్నించు. అసలు లక్ష్యం లేకుండా నైపుణ్యతను ప్రదర్శించకూడదు. —స్వామీ చిన్మయానంద

సింధు నాగరికతకు సంబంధించిన 1:2:4 కొలతలలో కాల్చిన ఇటుకలు, రక రకాల ఆకారాలలో కుండలు, మట్టి కంకణాలు, బొమ్మబిళ్ళు, దంతపు నగిషీలు పొదిగిన వస్తువులు, ప్రత్యేక వ్రాతలు కలిగిన సీళ్ళు, ఆటబొమ్మలు, జంతువుల బొమ్మలు, రాగి పరికరాలు, ఆయుధాలు, స్నానపు తొట్టెలు, తూనిక రాళ్ళు వగైరా కనుగొనబడ్డాయి. అత్యధిక ఆరోగ్య సూత్రాలను అనుసరించి పట్టణ నిర్మాణం కావించబడింది.

భారతదేశంలో పంజాబులో రూపార్, రాజస్థాన్‌లో కాలీబంగన్, గుజరాత్‌లో లోథాల్ ముఖ్యమైన ప్రదేశాలు మూడు సింధు నాగరికతకు చెందినవి. రాజస్థాన్ హనుమాన్ ఘర్‌కు దగ్గిర కాలీబంగన్‌లో ప్రపంచంలో మొట్టమొదట దున్నబడిన క్షేత్రాలు కనిపించాయి. ఇచ్చట లభించిన కుండ పెంకులమీద ఆనాటికే వ్రాత కుడి ప్రక్కనుంచి ఎడమప్రక్కకు ఉండినట్టు నిర్ణయించబడింది. గుజరాత్‌లో లోథాల్ ఒక ముఖ్యమైన 218 × 37 మీటర్ల వైశాల్యం గల నౌకా కేంద్రము.

మధ్యపరిగణా ప్రదేశంలో సింధు నాగరికత రానురాను క్షీణించి నశించిపోయింది. లాండ్‌స్కేప్ (దృష్టిగోచర ప్రదేశం) క్షీణదశలో ఉంది. మొహెంజొదారో (పాకిస్థాన్ సింధు రాష్ట్రంలో) పూర్తిగా నశించినట్లు అనేక నిదర్శనలు కనిపిస్తున్నాయి. ఇతరత్రా దక్షిణప్రదేశాలు ఇతర నాగరికతలలో కలిసిపోయాయి.

ఇప్పటికీ సింధు నాగరికతకు చెందిన లక్షణాలు గోచరిస్తున్నాయి. ఆనాటి దేవీ ఆరాధన. శివలింగార్చన, చెట్లకు, జంతువులకు పూజలు మొదలైనవి హిందువులు గ్రహించారు. వ్యవసాయం, లోహపు వస్తువుల తయారి, చేతులకు నిండుగా కంకణాలు ధరించడం నేటికీ ఉన్నాయి.

సింధు నాగరికత ప్రభావం మన సంస్కృతి సాంప్రదాయాలపై అధికంగా ఉన్నట్టు కనిపిస్తుంది.

— 'పార్థా బులెటిన్' సౌజన్యంతో

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద నీటి పారుదల సౌకర్యం



పంజాబులో రావి - బీస్ నదుల నీరు 649 కి.మీ. లు ప్రవహించి ఇందిరాగాంధీ కాలువను చేరుతున్నాయి. ఈ బ్రహ్మాండమైన కాలువ నీటి పారుదల సౌకర్యంవల్ల రాజస్థాన్ భవిష్యత్తు పూర్తిగా మారి ఒక పెద్ద వ్యవసాయ క్షేత్రంగా మారిపోతుంది.

## ఎక్స్‌ప్రెస్ మార్గము రైలురోడ్డు చేరిన సెటో ఒహాషి బ్రిడ్జి

జపానులోని హోన్షు మరియు షికోకు ద్వీపాలను చేర్చే సెటో ఒహాషి బ్రిడ్జి ఎక్స్



SETO OHASHI BRIDGE JAPAN

ప్రెస్ మార్గం. రైలు రోడ్డు చేరి ఉంటుంది. దీంట్లో ఆరు బ్రిడ్జిలు ఉంటాయి. ఇవన్నీ సెటో ఇన్‌లాండ్ సముద్రంలో ఉన్న చిన్న చిన్న ద్వీపాలను కలుపుతాయి. వీటి మొత్తం పొడవు 9.4 కి.మీ.లు.

* * *

## 17 వ సం.రం. ప్రాయంలో సుప్రసిద్ధ డాక్టరు

క్రిస్టైన్ బెనర్జీ అనే 11 సం.ల వయస్సు గల భారతీయ యువతి యునైటెడ్ స్టేట్స్ నాలుగు సంవత్సరాల ప్రిమెడికల్ ప్రోగ్రాం మొదటి సంవత్సరం చదువుతూంది. 17 వ సం.రం. వయస్సులో గొప్ప డాక్టరుగా పేరు పొందాలని ఈమె ఆశయం. ఈమె స్కూలు గ్రేడులు, కాలేజి ఎడ్మిషన్ టెస్టులలో పొందిన నైపుణ్యతవల్ల చిన్న వయస్సులోనే మెడికల్ కాలేజీలో సీటు సంపాదింతుకుంది.

—'యుఎస్ఐఎస్' సౌజన్యంతో

* * *

## పర్షియన్ గల్ఫ్‌లో నౌకలపై తిరుగుబాటు

లాయడ్ ఇన్సూరెన్స్ కంపెనీ వారి ప్రకారం 1988 లో పర్షియన్ గల్ఫ్ లో నౌకలపై తిరుగుబాట్లు రికార్డును స్థాపించాయి. దీనివల్ల నౌకల స్వంతదారులకు అపారమైన నష్టం ఏర్పడింది. 1988 లో మొదటి 148 రోజులలో 76 నౌకలు ఎదిరింపబడ్డాయి. సగటున రోజు విడిచి రోజు ఒక నౌక ఎదిరింపబడింది. దీనివల్ల లాయడ్ కంపెనీవారు ఇన్సూరెన్స్ రేటును పెంచుతూండాలి. అంతేగాక ఆ ప్రదేశంలో నౌకల మీద నియమింపబడిన నావికులకు ఒక్కొక్కసారి ప్రయాణానికి ఒక్కొక్కరికి 5000 డాలర్లులభిస్తుంది.

* * *

## మొట్టమొదటి రోల్స్ రోయిస్ మోటారుకారు 1904 లో నిర్మింపబడింది

1904 లో హెన్రీ రోయిస్ మొట్టమొదటి రోల్స్‌రోయిస్ మోటారు కారును నిర్మించాడు. కాలక్రమేణా రోల్స్‌రోయిస్ మోడల్స్ కోచి నిర్మాణంలో విశిష్టతాప్రమాణాలు,

"మార్గమేదైనా గమ్యం చేరడం ప్రధానం"

ప్రగతి పొందిన ఇంజనీరింగు నైపుణ్యత, అపూర్వమైన నమ్మకం సంతరించుకున్నాయి. 1904 లో నిర్మింపబడిన రోల్స్‌రోయిస్ కార్లలో 65 శాతం పైగా ఇప్పటికీ ఇంకా తిరుగుతున్నాయి.

* * *

## గంటకు 140 కి.మీ ల వేగవంతమైన రైలు

ఢిల్లీ మరియు యూపీ (ఉత్తర ప్రదేశ్) మధ్య నడిచే పూర్తిగా ఎయిర్ కండిషన్



చేయబడిన సూపర్‌ఫాస్ట్ రైలు వేగం గంటకు 140 కి.మీ.లు ఉంటుంది. వీటి మధ్య దూరం 414 కి.మీ.లు 5 గంటల లోపు పూర్తి చేస్తుంది. గంటకు 160 కి.మీ.ల వేగం పొందగల ఈ రైలు అత్యాధునికంగా ప్రయాణీకులకు సౌకర్యాలను కలిగిస్తుంది.

* * *

## చౌర్య నిరోధక 'మాజిక్ ఐ'

బ్రిటిష్ కాలేజి లైబ్రరీలలో పుస్తకాలను దొంగిలించకుండా చౌర్యనిరోధక 'మాజిక్ ఐ'ని ఉపయోగిస్తున్నారు. ఈ 'మాజిక్ ఐ' ప్రసరింపజేసే కిరణం పుస్తకానికి తగిలించిన టాగ్ మీద పడినప్పుడు ఆలారం గంట మ్రోగుతుంది.

* * *

## చరిత్రలో మిక్కిలి పెద్ద విందు

సుప్రసిద్ధ రోమన్ సైనికుడు, రాజ్యాంగ నేత అగు జూలియస్ సీజర్ తన పాంపే ఘన విజయోత్సవాన్ని జరుపుకుంటూ ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద విందును ఏర్పాటు చేశాడు. ఈ విందులో 1,50,000 మంది అతిథులకు 22,000 బల్లలు వేయబడ్డాయి.

(16 వ పేజీ తరువాయి)

ఇటువంటి శబ్దంవల్ల మానవుల వినికిడి శక్తి పోతుంది. ఇదే శబ్దం విడువకుండా చెవుల్లో పడుతుంటే చెవుడు రాకమానదు.

అభివృద్ధి పొందిన వర్ధమాన దేశాలలో, పెద్దపెద్ద నగరాలలో నివసించేవారు ఇప్పుడు వారాంతంలో విశ్రమించడానికి ప్రక్క-ప్రక్క గ్రామాలలో చిన్నచిన్న కుటీరాలు నిర్మించుకుంటున్నారు. వీరు సద్దు, చప్పుడు లేని నిశ్శబ్దమైన సహజ వాతావరణంలో పొందే లాభాలను గ్రహించడం మొదలుపెట్టారు.

వ్యక్తి జీవితంలో మౌనంవల్ల కలిగే సత్ఫలితాలను మన ఋషులు ఏనాడో గ్రహించారు. అరవిందయోగి ఆశ్రమంలో దీర్ఘ కాలంపాటు మౌనం పాటించేవాడు. ప్రతీ రోజూ రాత్రి 9 గంటలు తరువాత మౌనంగా ఉండాలని, మౌనంవల్ల తను ఎంతో ఉపకారం పొందానని జనరల్ డిగాలె చెప్పాడు.

ప్రతీరోజూ నిర్ణీతకాలం పాటు పూర్తిగా మౌనం పాటించాలి. దీనివల్ల వ్యక్తికి విశ్రాంతి కలిగి హాయిగా ఉంటుంది.

—'ఆల్ అబౌట్ గుడ్ హెల్త్' సౌజన్యంతో

## బల్బులు కాంతిగా ప్రకాశించాలంటే

బల్బులు ఎక్కువ కాంతిమంతంగా ప్రకాశించాలంటే తడిబట్టకు బదులు శుభ్రమైన గుడ్డమీద మిథిలేటెడ్ స్పిరిట్ వేసి ఆ బట్టతో బల్బులను తుడవండి.

*　　*　　*



## పార్శిలు గట్టిగా కట్టాలంటే

పార్శిలు గట్టిగా కట్టాలంటే కట్టేముందు దారాన్ని తడిచేసి కట్టండి.

*　　*　　*

## ఇంట్లో తయారు చేసుకోగల మంచి బ్లీచింగ్ లోషన్

అయిదుపాళ్ళ పన్నీరుకి ఒక పెద్ద చెంచాడు నిమ్మరసం కలిపి మంచి బ్లీచింగ్ లోషన్‌ను తయారు చేసుకోవచ్చు.

*　　*　　*

## కాఫీ రుచి బాగా ఉండాలంటే

కాఫీకి ఒక చిటికెడు ఉప్పువేస్తే ఘుమఘుమలాడుతూ ఉంటుంది.

*　　*　　*

## డబ్బాలో మిగిలిన పెయింట్ మట్టం తెలుసుకోవాలంటే

పెయింట్ డబ్బాలలో పెయింటు వాడిన మట్టానికి రబ్బరు బాండ్లు చుట్టి ఉంచితే ఎప్పటికప్పుడు మూతలు తీసి అవస్థలు పడక్కర లేకుండా మట్టం సులభంగా తెలుసుకోవచ్చు. ●

(14 వ పేజీ తరువాయి)

కల్పించుకున్నాడు. వీటికి మూలం వాంఛ. సాఫల్యం కోసం తపన. 'తెలిసి ఉద్దేశ పూర్వకంగా సాగించే సాధన వాసనాబద్ధమైన మనస్సు పరిధిలోనే సాగుతుంది. అందువల్ల స్వేచ్ఛ ఉండదు. మనస్సు పూర్తిగా నిమగ్నమైనప్పుడు అమరత్వం సిద్ధిస్తుంది' అంటాడు.

ఇతడి ఉపదేశాలు అతి క్లుప్తంగా ఎంతో భావాన్ని ఇముడ్చుకుని ఉంటాయి. మానసిక స్వాతంత్ర్యం, ఉపదేశ సారాంశం. అతడు స్థాపించిన పాఠశాలల ఉద్దేశము. చిన్ననాటి నుంచే పిల్లలకు దేశ, జాతి, మత విచక్షణ లేని సక్రమ విద్యాభ్యాసంవల్లే ప్రపంచపు భావి ప్రగతి ఏర్పడుతుందని ఇతడి అభిప్రాయం.

—'కుండలిని' సౌజన్యంతో

డా. కె. నారాయణన్

దంతచికిత్స మిక్కిలి ప్రాచీనమైనది. ఆదిమ మానవులలో కూడా దంతరోగాలు, దంతక్షయం ఉన్నట్లు నిదర్శనాలు కనిపిస్తున్నాయి. దంతవైద్యము 3700 బి.సి. లోనే ప్రారంభమైంది.

ఈజిప్టు మమ్మీల (ఈజిప్షియనులు ఎంబామింగ్ అనే ప్రత్యేక ప్రక్రియతో భద్ర



పరచిన మృతకళేబరాలు) ముఖాల పరిశీలనల వల్ల 4000 సంవత్సరాలకు పూర్వం ప్రాచీన ఈజిప్షియనులు నేటి ఆధునిక మానవులలాగే అనేక దంతరోగాలతో బాధపడే వారని ఋజువు అవుతూంది. అధికంగా తీపి పదార్థాలను తినడంవల్ల ఇప్పుడు ఏర్పడే దంతక్షయం ఆనాడు లేకపోయినా పూర్తిగా దంతాలు చిగుళ్ళవరకు అరిగిపోవడం ఆనాడు ఉండేది. ఇది ముఖ్యంగా వారు తినే రొట్టెలో ఉండే గట్టి పదార్థాలు నమలడంవల్ల ఏర్పడేది.

నేటి నవీన దంతవైద్యులు అనేక దంత సమస్యలకు చికిత్స కలిగిస్తున్నట్టే ఆనాడూ అనేక దంత సంబంధమైన రోగాలకు ఆనాటి దంతవైద్యులు చికిత్స చేస్తూండేవారు. వాటిలో కృత్రిమ దంతాలు కట్టడం ప్రాచీన ఈజిప్షియనులే ప్రారంభించినట్టు ఈజిప్టు రాజధాని కెయిరోలో 1952 లో లభించిన 4,500 సంవత్సరాల నాటి ప్రాచీన పుర్రె పరిశీలన వల్ల తెలుస్తూంది. ప్రాచీన ఈజిప్టులో 2700-2200 బి.సి.లో దంతవైద్యం ప్రారంభించినట్టు నిపుణులు అందరూ అంగీకరించారు.

చిగుళ్ళవాపు, దంతపు పోటు మొదలైన వాటికి ఈజిప్షియనులు దంతాలకు ములాము (ఆయింటుమెంటును) రాసేవారు. ప్రాచీన ఫోనిసియనులు (phoenicians) కూడా ఊడిపోయిన పళ్ళకు కృత్రిమ పదార్థంతో దంతాలు కట్టేవారు.

బ్రిటిషు పరిపాలనా కాలంలో యునైటెడ్ స్టేట్స్‌లో ఫ్రెంచి మరియు పోలిష్ దంత

## గొప్పవారి గొప్పతనం

సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు మొదలైన ద్వంద్వముల పట్ల సమాన బుద్ధి గలవారే గొప్పవారు. క్లేశములు కలిగినప్పుడు ఎవరి మనస్సు కలత చెందదో, సుఖము కలిగినప్పుడు ఎవరికి కోరిక కలుగదో అటువంటివారే స్థితప్రజ్ఞులు. అదే గొప్పవారి గొప్పతనం. ద్వంద్వాతీతులైన గొప్పవారి నిత్యానిత్య వస్తువివేకం గొప్పతనం. —మోనిష్ఠ

"కాయం నిత్యం కాకపోయినా కీర్తి నిలుస్తుంది"

వైద్యులు దంతవైద్యాన్ని అవలంబించారు. నవీన దంతవైద్యం 1840 లో హొరేస్ హెచ్. హెయ్‌డన్ మరియు చాపిన్ ఎ. హారిస్ అనే శాస్త్రజ్ఞులతో ప్రారంభమైంది. 1632-1723 సంవత్సరాల మధ్య ప్రకృతి చరిత్రను అభ్యసించే డచ్ విద్యార్థి ఏన్‌టన్ వాన్ లీయు వెన్ హూయెక్ సూక్ష్మ జీవ శాస్త్రానికి ఆద్యుడు. ఇతడు తను తయారు చేసిన సూక్ష్మదర్శిని (మైక్రోస్కోపు) సాధనను ఉపయోగించి మానవుని నోటిలో సూక్ష్మ జీవులు వృద్ధిపొందుతాయని నిర్ధారణచేసాడు. నోటిలో అవి ఎలా చేరతాయో చెప్పలేక పోయినా నోటిలో అనేక రకాలైన సూక్ష్మ జీవులు వృద్ధిపొందుతూన్నాయని మాత్రం ఇతడు వివరించగలిగాడు. ఆనాడు దంతపు పోటుకు, వాపుకు దంతముపై సల్ఫ్యూరిక్ ఆసిడ్ పోసి సూక్ష్మజీవులను నశింపజేసే వారు. వాస్తవంగా ఈ సల్ఫ్యూరిక్ ద్రావణం దంతం క్రింది నరాల సూక్ష్మపొరలను దహించి విస్తారంగా బాధపెట్టేది!

మధ్యయుగంలో మంగలి వృత్తితో జీవించేవారు దంతవైద్యం అవలంబించారు. ఈ వృత్తి గౌరవానికి భంగం అని వైద్యులు దీనిని చేపట్టేవారు కాదు. అనేక రోగాలకు నేటి ఆంటి బయోటిక్ వైద్యంలాగే ఆనాడు దంత రోగాలకు వైద్యులు చెడిపోయిన రక్తాన్ని తీసివేసి, మూలికలతో తయారు చేసిన మౌత్‌వాష్ (నోటిని శుభ్రపరచే లోషను) వాడేవారు. రోగుల చెవులలో కూడా అనేక ఔషధాలు వాడేవారు. మత్తుమందు వైద్యం తెలియని రోజులలో నాటువైద్యులు దంతరోగాలకు చికిత్స ప్రజావినోదంగా చేసే వారు. దంతాన్ని ఊడదీయవలసినప్పుడు ఒక హాస్యగాడు వచ్చి రోడ్డుమీద ప్రేక్షకులకు హాస్యం కలిగిస్తూండేవాడు. సహాయకుడు రోగిని కదలకుండా పట్టుకుంటే దంతవైద్యుడు పంటిని బలవంతంగా పటకారుతో లాగేసేవాడు. రోగి బాధవల్ల చేసే గోల వినిపించకుండా గట్టిగా మద్దెల వాయించే వారు. నొప్పి లేకుండా ఎన్ని మందులు ఉపయోగిస్తూన్నా నేడు కూడా దంతవైద్యుని దగ్గర రోగులు భయంతో గజగజలాడి పోతారు.

## భూమికోతవల్ల రూ. 6,000 కోట్ల నష్టం




భారతదేశంలో సాలీనా ఆహారధాన్యాల ఉత్పత్తిలో భూమి కోతవల్ల రూ. 6,000 కోట్ల నష్టం ఏర్పడుతూంది. అడవులను కొట్టివేయడం, పశువులను మేపడం, భూగర్భ జలాలను అత్యధికంగా వినియోగించుకోడం అరికట్టగలిగితే ప్రకృతి వైపరీత్యాలను అరికట్టవచ్చు.

—'సిఇఇ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

"మంచి పుస్తకాన్ని తెరిచిన ప్రతిసారీ ఎంతో కొంత నేర్చుకుంటావు."

# మానవజీవితం ఎలా గడుస్తుంది?

సగటు మానవునిమీద జరిపిన పరిశీలనవల్ల తెలిసిన కొన్ని ఆశ్చర్యకరమైన ఫలితాలు ఇక్కడ పొందుపరచబడ్డాయి. మానవులు జీవితంలో 20 మొదలు 24 సంవత్సరాలు నిద్రతో గడిపేస్తారు. 15 సంవత్సరాలు పని చేస్తారు.

ఆహారం తినడంతోను, పానీయాలు త్రాగడంతోను 8 సంవత్సరాలు గడుస్తుంది.



వినోదాలు, వింతలు, సినీమాలతో 8 సంవత్సరాలు గడపితే, బట్టలు ధరించడం, ఉతుక్కోడం మొదలైనవి 5 సంవత్సరాలు ఉంటుంది.

70 సంవత్సరాలలో సగటు మానవుడు ఉష్ణప్రదేశాలలో 18,000 పర్యాయాల కంటే అధికంగా క్షవరం చేసుకుంటాడు. దీనికి సుమారు 3,000 గంటల కాలం వినియోగిస్తాడు. గడ్డం మీద వెంట్రుకలు వారానికి 1/8 వంతు అంగుళం పెరుగుతూంటాయి. కాబట్టి సంవత్సరంలో మొత్తం 8 అంగుళాలు కత్తిరిస్తాడు. ఈ పెరుగుదలను ఇలాగే పోషించుకుంటూ వస్తే ఆ మనిషి 25 అడుగుల పొడవైన వెంట్రుకలతో కప్పబడిపోతాడు.

సగటు మానవుడు ప్రతీరోజూ 20,000 అడుగులు వేసి నడుస్తూ 80 సంవత్సరాలు వచ్చేటప్పటికి అరబిలియను అడుగులు వేసి భూగోళాన్ని ఆరుసార్లు చుట్టినంత దూరం నడుస్తాడు.

నిరీక్షిస్తూ ఊరికే కాచుకుని ఉండటం - ఇది 3 సంవత్సరాలు. మాటలతో ఆడవారికి 5 సంవత్సరాలు, మగవారికి 4 సంవత్సరాలు. ఆహారం తినడం, పండ్లు కాయకూరలు తినడానికి సుమారు 6 సంవత్సరాలు.

రోగంతో మంచంమీద 3 ఏళ్ళు, ముక్కు చీదుకోడం 10 రోజులు, అద్దం చూసుకోడం 70 రోజులు.

మానవ హృదయం వంటి సునిశితమైన పంపుని ఏ ఇంజనీరింగ్ నిపుణుడు కనిపెట్టలేదు. మానవ హృదయం గంటకి 60-75 గాలనుల రక్తాన్ని పంపుచేస్తుంది. మానవ శరీరంలో రహదారి విధానం మహాద్భుతం.

## మరణించినవాడు లేచి బయటకు వచ్చాడు

ఇటలీ సిసిలీలో పెలర్మో శ్మశానానికి తీసుకువచ్చిన శవపేటికలో 56 సంవత్సరాల ఆంటోనియో పెర్పెల్లి కళేబరం అకస్మాత్తుగా ప్రాణాలతో లేచింది. శవపేటిక కూడా వచ్చినవారు భయంతో కేకలు వేసుకుంటూ పరుగెత్తారు. ఈ భయంతో అతడి అత్తగారు అక్కడికక్కడే మరణించింది.

"ముఖస్తుతి, చేసేవాడినీ దానిని అంగీకరించే వాడినీ అవినీతిపరునిగా మారుస్తుంది."

60 మొదలు 100 వేల మైళ్ళ బాట. మానవ శరీరం 10,000,000,000,000,000,000,000,000,000 అణువులతో నిర్మింపబడింది.

పెరిగిన సగటు మానవునికి ఎముకలలో మజ్జ (Bone marrow) ఒక సెకండుకి 10 000,000 క్రొత్త ఎర్ర రక్తకణాలను ప్రవృద్ధిచేస్తుంది. మోకాలిక్రింద కాలి ముందు



వైపుండే దృఢమైన ఎముకే షిన్‌బోన్ (Shin bone), ఇది 3,600 పౌండ్ల భారాన్ని వహించగలదు.

సగటు మానవుని తలమీద సుమారు 1,21,630 వెంట్రుకలుంటాయి. మానవ శరీరంలో అంగప్రత్యంగాలన్నీ గణితశాస్త్రం ప్రకారం అతి ఖచ్చితంగా నిర్మింపబడి ఉంటాయి. మానవుని మొత్తం ఎత్తు పాదం పొడవుకి ఆరు రెట్లుంటుంది.

సగటు మానవునిలో సుమారు 10 గాలనుల నీళ్ళుంటాయి. మానవ శరీరంలో ఉండే క్రొవ్వుతో 7 సబ్బులను (Soap bar) తయారు చేయవచ్చు.

పుట్టినప్పుడు శరీరంలో 270 ఎముకలు ఉంటాయి. పెరిగిన తరువాత మనిషి శరీరంలో 206 మాత్రమే ఉంటాయి.

మనిషికి 639 కండరాలు ఉన్నాయి. వ్యాయామము తర్ఫీదును బట్టి ఒక చదరపు అంగుళం కండరం 56 మొదలు 140 పౌండ్ల భారం ఎత్తగలదు. మానవుని యందు గట్టి స్నాయువులు నోటిలో కండరాలు. వ్యక్తి భారానికి రెట్టింపు ఒత్తిడిని కలిగిస్తాయి. మొండెమును తొడలను చేర్చే పెల్విక్ లిగమెంట్లు (పీచువంటి టిస్యూపొరలు) చాలా బలంగా ఉంటాయి. దగ్గర దగ్గర 1000 పౌండ్ల భారం వహించగలవు.

ఒక చిన్న గ్రామంలో నివసించే మనిషి తీసుకునే ప్రతీ ఊపిరిలోను 125 మిలియను ధూళికణాలు ఉంటాయి పట్టణాలలోను, నగరాలలోను గాలిలో ధూళికణాలు చాలా అధికంగా ఉంటాయి. జీవిత కాలంలో మనిషి ముక్కు ఉఛ్ఛ్వాసముతో 45 పౌండ్ల దుమ్ముని వదపోస్తుంది.

## నెల్సన్ మరణవార్త లండన్ చేరడానికి రెండు వారాలు పట్టింది

అడ్మిరల్ లార్డ్ నెల్సన్ 1805 లో ట్రఫాల్‌గర్ యుద్ధం విజయం తరువాత విక్టరీ నౌకలో మరణించాడు. ఈ మరణవార్త లండన్ (ఇంగ్లండు) చేరడానికి రెండు వారాలు పట్టింది. 1963 లో అమెరికా ప్రెసిడెంటు జాన్ కెనడి హత్య కావింపబడ్డాడు. ఈ వార్త ప్రపంచం అంతా కొద్ది సెకండ్ల కాలంలోనే పాకిపోయింది.

## నందాదేవి జీవావరణం నిర్ణయించబడింది

ఉత్తరప్రదేశ్ చామోలి, పిథోరాఘర్ మరియు అల్మోరా జిల్లాలకు సంబంధించిన



నందాదేవి జీవావరణ నియామక మరియు నిర్వహణకు ప్రణాళిక సిద్ధం చేయబడింది. మొత్తం 1560 చ.కి.మీ.ల వైశాల్యంగల ఈ ప్రదేశానికి సరిహద్దులు ఏర్పరచబడ్డాయి. ఇక్కడ పెరిగి ప్రవృద్ధిపొందే మొక్కలు, చెట్లు, జంతువులను ప్రకృతిసిద్ధమైన విధానంలో సంరక్షించుటయే దీని ముఖ్యోద్దేశము.

## ఆంధ్రప్రదేశ్‌లో రాకెట్ ఫ్యూయెల్ ప్లాంట్

ఆంధ్రప్రదేశ్ తణుకులో రాకెట్లకు ఇంధనం తయారుచేసే ప్లాంటు ఏర్పాటు చేయబడింది. ద్రవరూపంలో ఇక్కడ ఉత్పత్తికాబడే అన్‌సిమిట్రికల్ డైమిథైల్ హైడ్రాజైన్ (UDMH), మోనో మిథైల్ హైడ్రాజైన్ (MMH) అంతరిక్ష కార్యక్రమాలకు, డిఫెన్స్ సైన్యాలకు, వ్యవసాయ కార్యక్రమాలకు ఉపయోగించబడతాయి. ఈ రాకెట్ ఇంధనపు ప్లాంటు ప్రారంభంతో ఇండియా ఈ ఇంధనాన్ని తయారుచేసే యుఎస్ఎ, యుఎస్ఎస్ఆర్, మరియు ఫ్రాన్స్ దేశాలలో ఒకటైంది.

## ఎడారి మిడుతలు బ్రహ్మాండంగా ప్రవృద్ధిచెందుతాయి

పశ్చిమోత్తర ఆఫ్రికాలో ఎడారి మిడుతలు అతి బ్రహ్మాండంగా ప్రవృద్ధిచెందుతున్నాయి. ఒక చదరపు కిలోమీటరు గుంపులో మొత్తం 5,00,00,000 మిడుతలు ఉంటాయి. ఇవి 100 టన్నులు తూగుతాయి. ఇవి ప్రతిరోజూ ఒక్కొక్కటి దానికి సమాన భారంగల పసరు మొక్కలను తినేస్తుంది.

### మాయ తొలిగితే సత్యం ప్రకాశిస్తుంది

ద్వేషం నశిస్తే ప్రేమ అంకురిస్తుంది.
లోభం నశిస్తే ఔదార్యం అంకురిస్తుంది.
భ్రమ నశిస్తే జ్ఞానం అంకురిస్తుంది.
వాంఛ నశిస్తే సంసిద్ధి కలుగుతుంది.
అహం నశిస్తే నిజం తెలుస్తుంది.
అంధకారం నశిస్తే వెలుగు ప్రకాశిస్తుంది.

"పదాలకు ప్రామాణికార్థాలు గ్రహించాలేగానీ
నానార్థాలు తీయడం అనర్థదాయకం."

## ప్రపంచంలో "పోరంబోకు" మాప్ తయారైంది:

యుఎస్‌ఎలో సియోర్రా క్లబ్ (Sierra Club) ప్రపంచంలో మొట్టమొదటి పోరం



బోకు (wilderness) మాప్ తయారు చేసింది. దీనిప్రకారం భూతలంమీద 12.4 బిలియను (1 24,000 మిలియను) ఎకరాల నేల ఇంకా సహజస్థితిలో పోరంబోకుగా ఉంది

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద మసీదు

ప్రపంచంలో మిక్కిలి పెద్ద మసీదు ఉత్తర ఆఫ్రికా మొరాకోలో కాసాబ్లాంకాలో నిర్మించబడుతూంది. దీనిని 'గ్రేట్ హాసన్ II మాస్క్' అంటారు. దీనిని నిర్మించడానికి 250 మిలియను డాలర్లు అవుతుందని అంచనా వేయబడింది. దీని మినారెట్ 180 మీటర్ల ఎత్తు ఉంటుంది.

## 100 సం. లు డాక్యుమెంట్లను భద్రపరచే క్రొత్త పరికరం

న్యూ ఢిల్లీ నేషనల్ ఫిజికల్ లేబొరేటరీలో శాస్త్రజ్ఞులు డాక్యుమెంట్లను 100 సంవత్సరాలవరకూ చెక్కుచెదరకుండా భద్రపరచడానికి ఒక క్రొత్త పరికరాన్ని కని పెట్టారు. దీంట్లో ఉండే గ్రాహక పాత్రలు ఒకటి ఎవర్ స్టీలుతోను, రెండవది గాజుతోను తయారుచేయబడుతుంది. ఇవి కారడానికి వీలు లేకుండా ఉండి హీలియం గాస్‌తో నింపబడి ఉంటాయి.

## ఒకమిలియను మందికి సముద్ర గర్భంలో వాసయోగ్యమైన నగరం

జపానువారు టోకియోకు 150 కి.మీ.ల దూరంలో ఒక మిలియను మందికి సముద్ర గర్భంలో 25 చ.కి.మీ.ల డాక్ నగరాన్ని నిర్మించదలచుకున్నారు. ఒకప్రక్క 3 కి. మీ.ల పొడవుగల ఈ నగరం సముద్రంలో 50 మీటర్ల ఎడంలో నిలబెట్టిన స్థూపాల మీద నిర్మిస్తారు. ఇక్కడ సముద్రం 50 మొదలు 100 మీటర్ల లోతు ఉంటుంది.

### వివేక నిధికి గ్రంథాలే తాళంచెవులు

వివేకం అనే అమూల్యమైన నిధికి
గ్రంథాలే తాళంచెవులు
ఆనందమయమైన ప్రదేశాలకు
గ్రంథాలే ద్వారాలు
ఊర్ధ్వ ప్రగతికి
గ్రంథాలే మార్గాలు
గ్రంథాలే స్నేహితులు, రండి చదువుదాం రండి.

—హోల్‌బ్రూక్ జాక్‌సన్

"వెలుగు వెంట చీకటి, ధ్వని వెనుక ప్రతిధ్వని,
మంచి వెనుక దోషం అంతర్గతంగా దాగి ఉంటాయి."

## పారిస్‌లో బ్రహ్మాండమైన గాజు స్థూపం

ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో లోవ్రె (Louvre) మ్యూజియం ప్రాచీనరాశి ఆవరణలో ఒక్క బ్రహ్మాండమైన గాజు స్థూపం నిర్మించబడింది. చైనాలో పుట్టిన అమెరికా శిల్పి ఐ.ఎమ్.పై దీనిని రూపొందించాడు.

## సోవియెట్ యూనియన్‌లో 2,550 మిలియను గ్రంథాలు, పత్రికలు ప్రచురింపబడ్డాయి

1986 లో సోవియెట్ యూనియన్‌లో సుమారు 2,550 మిలియను గ్రంథాలు, ఇతర పత్రికలు ప్రచురింపబడ్డాయి. ఇందులో కల్పనాకథలు (ఫిక్షన్), పిల్లల వాఙ్మయం 55 శాతం, మిగిలిన 45 శాతంలో రాజకీయ, వైజ్ఞానిక, సాంకేతిక సంబంధమైన పుస్తకాలు, రిఫరెన్స్ గ్రంథాలు, ఇతర టెక్స్ట్ బుక్కులు ఉన్నాయి. ప్రతీ సంవత్సరం 83,000 క్రొత్త గ్రంథాలు ప్రచురింపబడతాయి.

## 500 ఎలుకలకు ఒక టి వి సెట్:

బంగ్లాదేశ్ ప్రభుత్వంవారు అధమం 500 ఎలుకలను చంపిన రైతు సోదరులకు ఇప్పుడు టివిసెట్లు, ఇతర ఎలక్ట్రానిక్ గాడ్జెటులు బహుమతులుగా ఇస్తున్నారు. ఇక్కడ ఎలుకల బెడదవల్ల ప్రతీసంవత్సరం 1.4 మిలియను టన్నులకుపైగా బియ్యం, గోధుమలు నశించిపోతున్నాయి.

## కాండోర్ గ్రద్ద దక్షిణ అమెరికాలో ఉంది:

పెద్ద గ్రద్దవంటి పక్షి కాండోర్ దక్షిణ అమెరికా ఆండీస్ పర్వత ప్రదేశాలలో ఉంది. ఒకసారి ఒక కాండోర్ 20,000 అడుగుల ఎత్తున విమానంతో ఢీకొంది.

## 1000 మిలియను మంది ఆంగ్లేయ బాష మాట్లాడుకుంటారు



ఏ ఇతర భాషలకంటే ఆంగ్లేయ భాషలోనే ప్రపంచంలో చాలా ఎక్కువ మంది సంభాషణ సల్పుకుంటారు. భూమిమీద నివసించే జనాభాలో సుమారు ఒక బిలియను (1000 మిలియను) మంది ఇంగ్లీషు మాట్లాడతారు. 800 మిలియను మంది, చైనావారి మాండరిన్ భాష, 250 మిలియను మంది స్పానిష్, 200 మిలియను మంది హిందీ, 150 మిలియను మంది వరుసగా అరబిక్, బెంగాలీ, రష్యన్ భాషలు మాట్లాడుకుంటారు.

— 'ది రైట్ వర్డ్ ఎట్ ది రైట్ టైమ్' సౌజన్యంతో

"మనుష్యత్వము ఎంత దుర్లభమో ముముక్షుత్వం అంత దుర్లభం."



పుచ్చ, తర్బూజా, కిరిణి. సిద్దవటం, దోస మొదలైనవన్నీ భారతదేశంలో వేసవిలో పండే మధురమైన పళ్ళు. దేశంలో ఇవి అనేకచోట్ల ఉష్ణమండల ప్రదేశాలలో విరివిగా పండుతాయి.




వీటిలో ఆహారపు విలువ అంతలేక పోయినా ఎండాకాలంలో దాహాన్నితీర్చి మార్గాయాసాన్ని పోగొడతాయి. చలువచేసే గుణం ఉంది. హాయిని కలిగిస్తుంది. పుచ్చ, తర్బూజా, నేలమీద ప్రాకే గుమ్మడి జాతికి చెందిన తీగ. ఈ ఏకవార్షికపు తీగ నదీతీర ప్రదేశాలలోను, లంకలలోను, ఇసుక పొడి ప్రదేశాలలోను బాగా పెరుగుతుంది. ఇవి పెరగడానికి నీరు విస్తారంగా ఉండాలి. కానీ నిలువ ఉండకూడదు. ఉష్ణమండలపు వాతావరణం దీనికి అనుకూలం. వర్షము, పిండి మంచు, మబ్బులవల్ల పాదులు చెడిపోతాయి. గాలివల్ల, ఆకు చిరిగి పోతుంది. కాపు బాగా దిగదు.

సాధారణంగా జనవరి, ఫిబ్రవరి మాసాలలో 210 లేక 240 సెం.మీ.ల దూరంలో వరుసలలో గోతులు త్రవ్వి బాగా చీకిన పచ్చి పెంట, పశువుల ఎరువు నింపి 3 లేక 4 విత్తనాలు ఒక్కొక్క గోతిలో నాటుతారు. ఇవి మొలిచి కొద్దిగా పెరిగినతరువాత ఒక్కొక్క గోతిలో రెండేసి మొక్కలు పెరగనిస్తారు. విత్తనాలు నాటిన 4, 5 మాసాలలో తీగలు బాగా పెరిగి కాపుకు వస్తాయి. ఒక్కొక్క పాదుకు 4, 5 కాయల కంటే అధికం ఉంచరు. జనవరి, ఫిబ్రవరి లోను, తిరిగి జూన్, జూలై మాసాలలోను ఏడాదికి రెండుపంటలు పండిస్తారు.

పుచ్చని వృక్షశాస్త్రరీత్యా సిట్రుల్లస్ వల్గారిస్ (Citrullus Vulgaris) అంటారు. దీని స్వస్థానం ఆఫ్రికా ఉష్ణమండల ప్రాంతం. హిందీలో దీనిని తర్బూజా అంటారు.

పుచ్చకాయలు చాలా పెద్దవిగా పెరుగుతాయి. పెద్దది సాధారణంగా 20 అంగుళాల ఉరపు ఉంటుంది. ముదురు ఆకుపచ్చరంగు పైతొక్కగల కాయలలో మెత్తటి గుజ్జు ఎక్కువ నీటితో ఎర్రరంగులో ఉంటుంది. లోపల పెద్ద పెద్ద నల్లటి విత్తనాలు అధికంగా మధ్యభాగంలో పొదగబడి ఉంటాయి. కొన్ని రకాలలో లోపల తెల్లటి గుజ్జు ఉంటుంది. ఎరుపురంగువే తియ్యగా ఉంటాయి. అందుకే చాలామంది వీటినే వాడుతారు.

కొన్ని కొండప్రదేశాలలో పెరిగే చేదు పుచ్చని వెర్రిపుచ్చ అంటారు. దీనిని సిట్రెల్లస్‌కోలో సింథిస్ అంటారు. ఇది ముఖ్యంగా ఔషధంగా వాడతారు. దీని తీగ, కాయలు,

"ప్రత్యక్షమైనదానితో మోసాలు ప్రమాదమైతే
పరోక్షమైనదానితో మహాప్రమాదం."

వేరు విరేచినకారిగాను, డైయూరిటిక్‌గాను ఉపయోగిస్తారు. దీని వేరు పాముకాటుకు మందుగా కూడా ఉపయోగిస్తారు.

పుచ్చకాయలలో తినగల భాగం 60 శాతం మాత్రమే ఉంటుంది. మిగిలిన భాగమంతా పైన తొక్కా, లోపల ఎక్కువ పీచు ఉంటుంది. దీంట్లో పెక్టిన్ (Pectin) విస్తారంగా ఉండడంచేత దీంతో సులభంగా జెల్లీలు, జాములు, మార్మలేడులు తయారు చేసుకుంటారు. రుచికరమైన స్క్వాష్‌లు, జ్యూస్‌లు సులభంగా తయారుచేసుకోవచ్చు.

గింజలు బాగా ఎండబెట్టి వండుకుని తింటారు. ఇవి చలవచేస్తాయంటారు. గింజలనుండి 34 శాతం ప్రోటీనులు, 52 శాతం నూనె లభిస్తుంది. ఈ గింజలనుండి తీయబడిన నూనె సువాసనగా ఉంటుంది. వంటలకు, దీపాలకు ఉపయోగిస్తారు. నూనె తీయగా మిగిలిన పిండి పశువులకు దాణాగా వాడతారు. చాలా పుష్టికరమైనది. మొక్కలకు ఎరువుగాకూడా వాడతారు.

భారతదేశంలో సిద్ధవటపు పుచ్చ, కిరిణి, కస్తూరిపుచ్చ చాలా ప్రసిద్ధి. ఇవి కుకుమిస్ మెలాన్ జాతికి చెందినవి. సంస్కృతంలో దీనిని 'మధుపాక' అంటారు.

పండ్ల ఆకృతి, పరిమాణము, గుజ్జురంగు, తొక్కపైని మచ్చలు, నునుపు లేదా దోరియ చారలు మొదలైన భేదములను అనుసరించి అనేక రకాలుగా వర్గీకరింపబడ్డాయి. కొన్నిటిని కస్తూరిపుచ్చ అంటారు. సాధారణంగా వీటి లోపలి గుజ్జు లేత నారింజ రంగులో ఉంటుంది. బెలూచిస్థాన్‌లో 'జరద' 'శారదా' అనే రకాలు చాలా ప్రశస్తమైనవి. ఆంధ్ర ప్రదేశ్‌లో బతాసా, హింగన్, లద్దుకిరిణి, జాల్‌బడమ అనే రకాలు పండుతాయి. గింజలు ఎండబెట్టి పైన తొక్కతీసి వక్క పొడిలోను, ఇతర వంటకాలలోను వాడతారు.

యునైటెడ్ స్టేట్స్ రకాలలో హనీగోల్డ్, హనీడ్యూ పర్షియన్ ఇంపీరియల్ కొన్ని ముఖ్యమైన కొత్తరకాలు.

సిద్ధవటం పుచ్చపండు మేహశాంతికి, రక్తశుద్ధికి, దేహపుష్టికి తోడ్పడుతుంది. వేసవిలో చల్లదనాన్ని కలిగిస్తుంది.

('హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో)

## అంటార్కిటిక్ ఖండంలో మంచుపొర




ఆస్ట్రేలియాకు సుమారు రెట్టింపు వైశాల్యం ఉండే అంటార్కిటిక్ ప్రదేశం అంతా పూర్తిగా మంచుతో ఆవరింపబడి ఉంటుంది. తక్కువ మందంగా ఉండేచోట 2000 మీటర్ల దళసరి, ఎక్కువ మందంగా ఉండేచోట 4,500 మీటర్ల దళసరి ఉంటుంది. ఇకమీదట భవిష్యత్తులో ఈ మంచు పూర్తిగా కరిగితే ఇప్పుడున్న సముద్ర మట్టం 70 మీటర్లు పెరిగి ప్రపంచంలో అనేక తీరప్రదేశాలు నీటి ప్రవాహంలో రూపురేఖ లేకుండా మునిగిపోతాయి.

# ఆత్మవిశ్వాసం అభివృద్ధి చేసుకోవాలంటే

డా. క్లైవ్ డి హర్లీ

మ్మనం ఉండవలసిన విధానం. తీరుతో సరపోల్చి చూసుకుంటే మనం ఇంకా నిద్ర మత్తులో ఉన్నట్టే అనిపిస్తుంది. మనకున్న మానసిక శక్తులను, శారీరక శక్తులను ఏ కొద్దిగానో వినియోగించుకుంటున్నాం కానీ



పూర్తిగా వినియోగించుకోడంలేదు. దీనినే విపులంగా వివరించాలంటే మానవుడు తన కున్న హద్దులకు లోపల ఎక్కడో దూరంగా ఉంటాడు. తనలో ఉన్న అతీతమైన వివిధ శక్తి సామర్థ్యాలను మానవుడు గ్రహించ లేక పోతున్నాడు అంటాడు సుప్రసిద్ధ మనస్తత్వశాస్త్రజ్ఞుడు విలియం జేమ్స్.

1. ఏది అవసరమో తెలుసుకో: సాధారణంగా మనందరికీ ఉద్దీపనశక్తి ఉండదు. ఏ పని చేసినా, ఏ గ్రంథం చదివినా, ఏ పరిశోధనచేసినా వాటివల్ల నీకు కలిగే ప్రయోజనం ఏమిటో గ్రహించుకో. లక్ష్యశుద్ధి ఉంటే ఉద్దీపనశక్తి అభివృద్ధి పొందుతుంది. ఉద్దీపనశక్తి అభివృద్ధి పొందినప్పుడు నీ కార్యసాధనలో నీకు సంభవించే అంతరాయాలను, ప్రతిబంధకాలను అతిసౌలభ్యంగా నెగ్గుకు వస్తావు. నీకు ఒకటి కావాలి అనుకున్నప్పుడు దాన్ని పొందడానికి కావలసిన ఉపాయాలను ఆలోచించక మానవు. చేయాలనుకున్నదానికి అవకాశం కల్పించుకోవడం సహజం.

2. కార్యసామర్థ్యం పొందాలంటే:

* ఆత్మవిశ్వాసాన్ని పూర్తిగా నమ్ముకో. అనుకున్నదానికంటే నీవు ఎంతో గొప్పగా సాధించగలవు. నీలో ఎంతోశక్తి నిబిడమై ఉంది. పారమార్థిక దృష్ట్యా పరిశీలిస్తే తప్పనిసరిగా సాధించగలగడానికి అవకాశాలు ఎన్నో ఉంటాయి. నీకు సహాయపడవలసిన ధర్మం పరమాత్మునికి ఉంది. నీ కార్యాన్ని నీవు సంపూర్ణంగా సాధించడానికి అవసరమైన సహాయం నీకు కలిగిస్తాడు.

* మనస్సులో నీ ఆదర్శానికి తగినట్లుగా నీవు బాహ్యంగా ఆచరించాలి. నీవు ఆచరించే విధానానికి నీ మనస్సుపై ఎంతో ప్రభావం ఉంటుంది. స్థిమితం అలవాటు చేసుకో.

### ప్రపంచంలో మొట్టమొదటి ఎటామిక్ సబ్‌మెరైన్ 1954లో ప్రారంభింపబడింది

ప్రపంచంలో మొట్టమొదటి ఎటామిక్ సబ్‌మెరైన్ "నాటిలస్" (Nautilus) 1954 లో ప్రవేశపెట్టబడింది.

"సౌందర్యము వస్తునిష్ఠముకాదు. ఒకరికి అందముగా ఉన్న వస్తువు వేరొకరికి అందముగా కనపడదు."

విశ్వలమైన ఆశాభావం అలవాటుచేసుకో. వంగిపోయి ఈదురోమంటూ ఉండకు. బల సత్వాలతో ఆరోగ్యకరంగా చకచకా నడవ డం అభ్యాసం చేసుకో.

* చైతన్యవంతంగా సాధించడానికి ప్రతీ అవకాశాన్ని లాభకరంగా వినియోగించుకో. చేసినవి మళ్ళీ చేస్తే పొరపాటులేదు. సాధించాలనుకున్నవాటిని పది రోజుల కు ముందే నిర్ణయించుకో. వాటిని పూర్తిగా నిర్వహించేదాకా పట్టినపట్టు వదలకు.

* కష్టపడి పనిచేయడం విలాసవంతమైన కృషిగా మార్చుకో. అది అసాధ్యం అనిపించవచ్చు. చేసేపని కూడా ఒక ఆటగా మారిపోవాలి. దీనివల్ల నువ్వు పొందే ఆనందం, సుఖం ఎంతో బ్రహ్మాండంగా ఉంటుంది.

* 'నేను ఇది జయిస్తాను. విజయం పొందడానికే భగవంతుడు జీవితాన్ని ప్రసా దించాడు. ఎంతో అధికంగా ఇంతకంటే బాగా సాధిస్తాను' అని ధైర్యం తెచ్చుకో.

* ప్రతీదాంట్లోను సంపూర్ణతను సాధించు. నీవు చేయవలసిన దానిని పూర్తిగా దోష రహితంగా సాధించు. ఆత్మవిశ్వాసం పెంపొందించుకోడానికి శక్తి సామర్థ్యాలను అత్యధికంగా వినియోగించుకోనక్కరలేదు. ఇటువంటి కిటుకులే చాలు.

3. నిరంతర కృషి: విజయం పొందే వారు విరమించరు. విరమించేవాడు విజయం పొందలేడు.

(ఎ) అత్యవసరం అయితేనే తప్ప చేపట్టిన కార్యం మధ్యలో విరమించకు. మొట్ట మొదట ఒక ప్రణాళికను ఏర్పాటు చేసుకుని దానిని అనుసరించు దీనివల్ల అనవసరమైన తాపత్రయం ఉండదు. కాలం వృధా అవదు. సాధించిన దానివల్లకాదు. ఏది చేయవలసి ఉందో అది పూర్తిగా నిర్వహించనప్పుడే నీకు శ్రమ, అలసట అనిపిస్తుంది.

(బి) ప్రతీది కష్టం అనుకోకు. నీకు ఎంతోశక్తి ఉంది. నీ శక్తి సామర్థ్యాలను తక్కువగా మదింపుచేసుకోకు. విరమించు కుందామనే కోరిక ఎప్పుడైతే బయలుదేరు తుందో అప్పుడే విసుగు, బడలిక, ఆయాసం బయలుదేరతాయి. కాబట్టి కాలయాపన చేయ కుండా వెంటనే చేయవలసిన పనిని ప్రారం భించు. (మిగతా 36 వ పేజీలో)

## నా జీవితంలో ప్రతిక్షణం రక్షించేవాడు పరమాత్ముడే



GANDHIJI

నా జీవితంలో ప్రతిక్షణం రక్షించేవాడు ఆ భగవంతుడే. ఆ పరమాత్ముని ఆజ్ఞలేనిదే ఆకు కూడా కదలదు. ప్రతీసారి తీసుకునే ఊపిరిలో ఆ దివ్యానుభూతిని పొందు తున్నాను. —గాంధీజీ

"గుండె ధైర్యాన్ని కోల్పోక ఓటమిని భరించడమే ధైర్యానికి నిదర్శనం."



ప్రపంచంలో అందరూ ఉన్నట్టు గాకుండా వింతగా ప్రవ ర్తించేవారు విపరీతబుద్ధులు. అటువంటివాళ్ళు చేసే పనులు నవ్వుపుట్టి స్తాయి. వారు లేకపోతే జీవితంలో తమాషా ఉండదు.




సుప్రసిద్ధ ఆంగ్ల రసాయన శాస్త్రజ్ఞుడు హెన్రీకావెండిష్ గదికి తలుపులు బిగించి తాళం వేసుకుని కూర్చునేవాడు. ఒక చిన్న కిటికీ సందులోనుంచి ఆహారం అందిస్తూండే వారు.

గణిత శాస్త్రవేత్త ఫ్రాన్సిస్ పెల్టన్ ప్రతీది లెక్క పెడుతూండేవాడు. కొలుస్తూండే వాడు. ఎవరు ఎన్నిసార్లు ఆవలిస్తున్నారో, ఎన్నిసార్లు కదులుతున్నారో కూడా లెక్క పెడుతూండేవాడు.

'ఎ డిక్షనరీ ఆవ్ ది ఇంగ్లీష్ లాంగ్వేజి' కూర్చిన ఆంగ్లేయ రచయిత డా. శామ్యూల్ జాన్సన్ రోడ్డుమీద నడుస్తూ ప్రతీ దీప స్తంభాన్ని ముట్టుకునేవాడు.

ప్రసిద్ధిపొందిన అమెరికన్ ఫిల్మ్ స్టార్ విక్టర్ మెచ్యూర్ స్నానం చేయడానికి 7,000 మైళ్ళు అట్లాంటిక్ మహాసముద్రాన్ని విమానంమీద దాటాడు. లండన్ (ఇంగ్లండ్) నుంచి బయలుదేరి యునైటెడ్ స్టేట్స్‌కి వెళ్ళి స్నానం చేసాడు. తిరిగి లండనుకు వచ్చి తన పని ప్రారంభించాడు.

సుమారు 300 అద్భుతమైన కాల్పనిక నవలలు రచించిన ఫ్రెంచి రచయిత అలెగ్జాం డర్ డ్యూమాస్ వ్యాసాలు పింక్ రంగు కాగితంమీద, పద్యాలు పసుపుపచ్చ కాగితం మీద, నవలలు నీలిరంగు కాగితంమీద వ్రాసే వాడు. ప్రతీసారి వ్రాయడానికి ప్రారంభించి నప్పుడల్లా ఒక క్రొత్త పెన్ ఉపయోగించే వాడు. గొప్ప ఆంగ్ల కవి షెల్లీ పద్యం ప్రారంభించేటప్పుడు శుభ్రమైన తెల్ల షర్టు వేసుకుని కూర్చునేవాడు.

(35 వ పేజీ తరువాయి)

(సి) పట్టినపట్టు విడవకుండా ఓర్పుతో, సహనంతో పనులను నిర్వహించు. జీవితం ఏ రంగంలోనైనా దిగ్విజయం పొందాలంటే పట్టుదలే ముఖ్యం. అదే లోపిస్తే ఏ పనీ పూర్తిగా చేయలేవు. పట్టుదల ఉంటే విన్ను ఏ శక్తులు ఆటంకపరచలేవు. అపజయం అనుకున్నావా ముందుగానే అణగారిపోతావు. దృఢనిశ్చయంతో నిర్భరంగా కొనసాగించే వారిదే విజయం.

కాబట్టి ఆత్మవిశ్వాసం లోపిస్తే ఒక్క సారి వివేకంతో విమర్శించుకో. అసలు లోపం ఎక్కడో ఉండదు. ఉద్దీపనశక్తి లోపించింది అన్నమాట.

'లోకం ఎప్పుడూ నలిగినదారినే పోతుంది. కొత్తదారి పాతబడితే మరోదారికి కలవరపాటు— ఇదే లోకం పోకడ.'

## రోడ్డు ప్రమాదాలవల్ల 4 లక్షల మంది మరణిస్తున్నారు:

ఇటీవలి లెక్కల ప్రకారం సుమారు 4 లక్షలమంది రోడ్డు ప్రమాదాలలో మరణి



స్తున్నారు. 80 లక్షలమంది గాయపడు తున్నారు. దీనివల్ల ప్రపంచం అంతటా రూ. 100 కోట్లు నష్టం ఏర్పడుతూంది.

* * *

## విద్యార్థులలో 80 శాతం పదవ తరగతి పైన చదవరు:

హ్యూమన్ రిసోర్సెస్ డెవలప్‌మెంట్ విభాగంవారి 1986 ఆక్షన్ ప్రోగ్రాంప్రకారం భారతదేశం విద్యార్థులలో సుమారు 80 శాతంమంది 10వ తరగతి దాటి పైన చదవరు. 8వ మరియు దానిక్రింద తరగతులలో విరమించుకునే విద్యార్థులు సాలీనా 120 లక్షల మంది, ఉజ్జాయింపుగా 20 లక్షల బాల బాలికలు 8వ తరగతి దాటినా 10వ తరగతి దాటివెళ్ళరు. వీరిలో చాలామంది ప్రావీణ్యత లేని పాటక జాతికి చెందినవారు.

—'యోజనా' సౌజన్యంతో

* * *

## భారతదేశంలో నాల్గవ వంతు నిరక్షరాస్యులు ఉన్నారు:

సగటున భారతదేశంలో నిరక్షరాస్యత 63.7 శాతం. స్టాటిస్టికల్ రిపోర్ట్సు ప్రకారం ప్రపంచంలో మొత్తం నిరక్ష్యరాస్యులలో నాల్గవ వంతు భారతదేశంలో ఉన్నారు.

—'యోజనా' సౌజన్యంతో

* * *

## ఇంటి సలహాలు

### ఆరి గట్టిబడ్డ షూ పాలిష్ ఉపయోగించాలంటే!

సాధారణంగా ఉపయోగించే షూపాలిష్ ఆరిపోయి పగుళ్ళు ఏర్పడతాయి. టర్పెంటైన్ చుక్కలు రెండు వేస్తే తిరిగి ఉపయోగించుకోడానికి వీలుగా మెత్తబడుతుంది.

### గడ్డి నిర్మూలిని

నీటిలో కాల్షియం క్లోరైడ్ కలిపి జల్లితే ఇంటి ప్రహరీగోడలమీద ఇటుకల మధ్య, రాళ్ళ మధ్య పెరుగుతున్న గడ్డి పూర్తిగా నశించిపోతుంది.

## 1987-88లో అల్యూమినియం ఉత్పాదన రికార్డు స్థాయిని అందుకుంది:

భారతదేశం 1987 - 88 లో 2,78,000 టన్నుల అల్యూమినియం ఉత్పాదించి రికార్డు స్థాపించింది. ఇంతకుముందు 1984 - 85లో 2,76,492 టన్నులు ఉత్పాదించింది.

* * *

## రూ 1,200 కోట్ల విలువగల దుస్తులు 1985-86 లో ఎగుమతి కావింపబడ్డాయి:

1980 - 81 లో రూ. 435 కోట్ల విలువ గల భారతీయ దుస్తులు ఎగుమతి చేయబడ్డాయి. ఇది అతి శీఘ్రంగా పెరిగి 1985-86 కి రూ. 1,200 కోట్ల విలువగల అధిక స్థాయిని అందుకుంది.

* * *

## తమిళనాడులో కుష్ఠురోగ జాడ్యులు అత్యధికం:

కుష్ఠురోగం తమిళనాడులో చాలా అధికం, 7,83,000 రోగులు ఉన్నారు. దీని తరువాత ఆంధ్రప్రదేశ్‌లో 6,28,000 రోగులు, కేరళలో 6,26,000 రోగులు ఉన్నారు. బొంబాయిలో 72,000 మంది, ఢిల్లీలో 1,500 మంది కుష్ఠురోగులు ఉన్నారు. భారతదేశం జనాభాలో సుమారు మూటికి రెండు వంతులు కుష్ఠురోగం ప్రబలిన ప్రదేశాలలో నివసిస్తున్నారు.

* *

## భారతదేశంలో ద్రవ్యోల్బణం రేటు:

1987 - 88 లో భారతదేశం ద్రవ్యోల్బణం రేటు (rate of inflation) 10.6 శాతం. ఇది 1986 - 87 లో 5.3 శాతం మాత్రమే. ఇటీవల సేకరించిన వివరాలనల్ల 1988 జూలై 9న ద్రవ్యోల్బణం రేటు 8 శాతానికి దిగిపోయింది.

## టెస్టుమాచ్‌లో మిక్కిలి శీఘ్రమైన స్కోరింగ్



1936 లో 27 జూలైన ఇంగ్లండ్ ఓల్డ్ ట్రాఫర్డ్ మాచ్‌లో స్కోరింగ్ అతిశీఘ్రంగా జరిగింది. ఒక్కరోజులో 588 పరుగులు చేయబడ్డాయి. ఇంగ్లండు 393 పరుగులు తీస్తే ఇండియా రెండవ ఇన్నింగ్స్‌లో 0 కి 190 పరుగులు చేసింది.

"విశ్వవ్యాప్తమై ఉన్న ఆధ్యాత్మిక పరిమళాన్ని పరమాత్మకోసం పరితపించేవారే ఆఘ్రాణించగలరు."

[illegible]

## జవహర్‌లాల్ నెహ్రూ

రాజకీయంగా ఎన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నా ప్రతి పౌరుడు దేశసంరక్షణకి, సంక్షేమానికి ఐక్యమత్యాన్ని పాటించాలి.

దేశ సమైక్యతకు, అభ్యున్నతికి ప్రాముఖ్యతను ఇవ్వాలి. ప్రతీ ఒక్కడు వ్యక్తిగత సంక్షేమానికి గాక దేశసంక్షేమానికి ఉద్యమించాలి.



ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనే వివక్షణ లేకుండా అందరూ సరిసమానంగా గౌరవించబడాలి.

జాతీయ కార్యక్రమాలలో పాల్గొనడానికి మహిళలకు తగిన అవకాశాలు కల్పించాలి.

పిల్లలను ప్రేమాభిమానాలతో కోపగించుకోకుండా, కొట్టకుండా ఆదరించాలి.

గ్రామీణ మరియు కుటీర పరిశ్రమలను ప్రోత్సహించాలి. వీలైనంతవరకు ఖద్దరునే వాడాలి.

ఇల్లు, వీధి, గ్రామము, నగరము ఎంత శుభ్రంగా ఉంచుకోడానికి వీలు ఉంటుందో అంత శుభ్రంగా ఉంచుకోవాలి.

శ్రామికులను గౌరవించాలి. ప్రతిపౌరుడు ఏదోవిధమైన శారీరక శ్రమను అవలంబించి నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను కొనసాగించాలి.

— 'ఏన్ అప్పీల్ టు ది పీపుల్ ఆఫ్ ఇండియా 1959'

### హైపవర్ ఎలక్ట్రాన్ బీమ్స్

యునైటెడ్ స్టేట్స్ న్యూ మెక్సికో ఆల్బుకర్క్‌లో సాండియా నేషనల్ లాబొరేటరీలలో విజ్ఞానశాస్త్రజ్ఞులు 46 మీటర్ల పొడవైన అధికశక్తి ఎలక్ట్రాన్ కిరణ పుంజాలను విజయవంతంగా అభివృద్ధి చేసారు. ఈ కిరణపుంజాలు న్యూక్లియర్ వార్ హెడ్‌లను దుర్బలపరుస్తాయి. ఇది విద్యుత్తు ప్రవహించే వేడి ప్లాస్మా తంతిగా వినియోగపడి కిరణపుంజ ప్రవాహాన్ని ప్రసరింపచేస్తాయి.

### పాఠకుల అభిప్రాయాలు

"లక్ష్యసిద్ధికై పరితపించేముందు
ఆత్మశుద్ధికై ప్రయత్నించు."

—కోగంటి సాంబశివరావు, తెనాలి.

* * *

"అనుభవంతో అడుగులేస్తూ పోతూంటే
ఆనందమే తప్ప ఆవేదన ఉండదు."

—సి. రవి, సంగారెడ్డి

"నిజాయితీ ఉన్న మనిషి మాటలోనూ
చేతలోను ఒకే తీరుగా ఉంటాడు."

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు]

1 ఎమ్. లక్ష్మీనారాయణ S/O లేట్ ఎమ్. విశ్వనాధం, కొత్తవీధి, (బాలాజీ పేట దగ్గర), బరంపురం. (గంజాం జిల్లా) (ఒరిస్సా) 760 002.

కలం స్నేహం, వ్యాపారం, ప్రకృతి ఆరాధన.

2. జల్దా వెంకటేశ్వర్లు. ఇంటర్ బి. పి. సి. రెండవ సంవత్సరం. 20 సం. లు. S/O జల్దా సత్తయ్య, పోస్టు మరియు గ్రామము సోమవరం, నేరేడుచర్ల మండలం, హుజూర్‌నగర్ తాలూకా, (నల్గొండజిల్లా) 508218

చిత్రలేఖనం, దైవభక్తి, ప్రకృతి ఆరాధన.

3. కె. చంద్రశేఖర్, 27 సం. లు, C/O కె. అంజయ్య. ఇం.నెం. 26-95, మెయిన్ బజారు, మిర్యాలగూడ పోస్టు, (నల్గొండ జిల్లా) 508 207.

సైన్స్ గురించి తెలుసుకొనుట, చెడును వ్యతిరేకించుట.

4. ఎమ్.ఎ. వాసీమ్. 16 సం.లు., S/O ఎమ్.ఎ. జబ్బర్, ఇం.నెం. 3-18, మహమ్మదాబాద్, రంగారెడ్డి జిల్లా, గద్వేల్ మండలం - 509 337.

చిత్రలేఖనం, కలం స్నేహం, స్టాంపుల సేకరణ.

5. సూపర్ స్టార్ టైలర్ అంజనేయులు, పద్యాట్ గ్రామము, మాగనూరు మండలం, మక్తల్ తాలూకా, (మహబూబ్ నగర్ జిల్లా) 509 208.

దినపత్రికలు చదవడంవల్ల జ్ఞానం పెంచుకోడం.

6. అరవ హేమంత్ కుమార్, (మహేష్), తొమ్మిదవ తరగతి, 14 సం.లు S/O అరవ లచ్చయ్య, 68/బి. కె బి. లేన్, రిష్రాపోస్టు (హుగ్లీ జిల్లా) (ప. బెంగాల్) 712 248.

డ్రాయింగ్ కార్టూన్లు వేయడం, ప్రకృతి పరిశీలన.

## తొమ్మిదిసార్లు మమ్మీ!




'ఒరేః గోడమీద వ్రాయవద్దని ఎన్నిసార్లు చెప్పాన్రా బడవాః'
'తొమ్మిదిసార్లు మమ్మీః'

"దండములనుండి సంపాదించిన బలముకంటే ప్రేమలో ఆర్జించిన బలము వేయిరెట్లు అధిక ప్రభావంతో సుస్థిరంగా ఉంటుంది."

# శ్రీ నారాయణగురు

డా. కె. సంతానరామన్

కేరళలో తిరువనంతపురానికి దగ్గరగా చెంపజన్తి అనే చిన్నగ్రామంలో మదన్ ఆసన్ నిమ్నజాతికి చెందిన 'ఎజవ' వ్యవసాయ కుటుంబంలో జన్మించాడు. ఇతడి భార్య కుట్టియమ్మ. మదన్ సంస్కృతంలో పాండిత్యాన్ని సంపాదించాడు. మాతృభాష



SRI NARAYANA GURU

మలయాళంలో ప్రావీణ్యం ఉంది. జ్యోతిష్యంకూడా బాగా నేర్చుకున్నాడు. వీరు ఒక చిన్న మట్టిగుడిసెలో నివసిస్తూండేవారు.

ఈ బీద దంపతులకు సెప్టెంబరు 20, 1854 న ఒక పుత్రుడు జన్మించాడు. అతడి పేరు 'నాను . తండ్రి మదన్, నానును ఒక చిన్న వీధిబడిలో చదివించాడు. చిన్న వయస్సులోనే ఇతడిలో పురోభివృద్ధి సూచనలు కనిపించాయి. రామన్‌పిళ్లై అనే గురువు దగ్గిర 'నాను' సంస్కృతం నేర్చుకున్నాడు. సంస్కృతంలోను, మలయాళంలోను మంచి ప్రావీణ్యతను సంపాదించాడు. సంస్కృతంలో కావ్యాలు, నాటకాలు, అలంకార శాస్త్రాలు, దర్శనాలు, ఉపనిషత్తులు చదివి వేదాంతంలో అపార పాండిత్యాన్ని సంపాదించాడు. సంస్కృతం, మలయాళం, తమిళభాషలలో కవిత్వం వ్రాయడం ప్రారంభించాడు. వీటికి తోడు ఇతడు యోగశాస్త్రంలో రహస్యాలను పూర్తిగా తెలుసుకున్నాడు. సుప్రసిద్ధ యోగులైన తాయికాడు, అయ్యపు యోగి, చెట్టాంబి స్వామి అనే గురువులవద్ద చేరి యోగాభ్యాసం అభ్యసించాడు.

నాను ఇరుగు పొరుగున ఉన్న పిల్లలకు సంస్కృతం నేర్పించేవాడు. నానుకి నాను ఆసన్ అనే పేరు స్థిరపడిపోయింది. నారా

## ముఖచిత్ర వ్యాఖ్య

(ఫిబ్రవరి 1989)

"ఆధ్యాత్మిక ఉద్యమాన్ని నడిపిన మహర్షి
ఆచరణలో మానవతను చూపిన
మనీషి!"

—భమిడిపాటి అప్పల నరసింహులు,
నరసన్నపేట.

* * *

"ఆత్మ సౌందర్య సాధకులే
జీవిత పరమార్థ ప్రబోధకులు."

—కె. శ్రీరాములు, మదనపల్లి.

యణ అనే పదాన్ని వ్యావహారికంగా నాను అంటారు. ఆసన్ అంటే ఉపాధ్యాయుడు. నాను మాస్టారే నాను ఆసన్, నారాయణ గురు.

నానుకు మనస్సులో మానవ జీవితాన్ని గురించి అనేక సంశయాలు, ప్రశ్నలు



బయలుదేరాయి. వీటికి సరైన సమాధానాలు తెలుసుకోవాలని నాను ఇంటిని వదలి ఒక సన్యాసిగా తిరువనంతపురానికి దగ్గరగా ఉన్న అరువిపురం దగ్గిర అడవులలోకి వెళ్ళిపోయాడు. జ్ఞానోదయం కలిగి కొంత కాలానికి తిరిగి ఊరికి చేరాడు. ఇతడి రూపాన్ని జ్ఞానసిద్ధిని గ్రహించి జనం ఇతనిని శ్రీ నారాయణగురు అని పిలవడం ప్రారంభించారు.

సంచారంవల్ల, ఆత్మబోధవల్ల శ్రీ నారాయణగురు నిమ్నజాతి కుటుంబాలకు కలుగుతున్న అన్యాయాన్ని గ్రహించాడు. నిమ్నజాతులవారికి, ఎజవలకు కూడా దేవాలయాలలో ప్రవేశముండేదికాదు. వీరి పిల్లలకు విద్య చెప్పేవారు కాదు. సంఘంలో వీరి పరిస్థితులు చూచి శ్రీ నారాయణగురు మిక్కిలి విచారించి తోటి మానవుల అభివృద్ధికి, అభ్యున్నతికి పాటు పడాలని దీక్ష వహించాడు.

తిరువనంతపురానికి దగ్గిరగా నెయ్యారు నదీ తీరంమీద అరువిపురంలో అనువైన స్థలం ఏర్పరచుకుని ఒక కుటీరం నిర్మించుకున్నాడు తన కార్యక్రమానికి దీన్ని కేంద్రంగా ఏర్పరచుకున్నాడు. వీరి ఉపదేశాలకు ముగ్ధులై కొన్ని రోజులకే అనేకమంది భక్తులు వీరిని సందర్శించడం ప్రారంభించారు. కుల, మత, జాతి భేదాలు లేకుండా అందరినీ ఒకే విధంగా ఆదరించాలని వారికి ఉపదేశించేవాడు. అచిరకాలంలోనే ఆ ప్రదేశంలో ఒక దేవాలయం ఆవిర్భవించింది. ఆ దేవాలయంలో అన్ని కులాలవారికి, మతాలవారికి ప్రవేశం ఏర్పడింది. దగ్గిరలో ఒక మఠం నిర్మింపబడింది. ఒక సంస్కృత పాఠశాల ఆవిర్భవించింది. కార్యక్రమం ముమ్మరంగా కొనసాగింది. ప్రతీచోట సంస్థలు ఏర్పడ్డాయి. "మానవులకు ఒకే దేవుడు, అంతా ఒకే జాతి, ఒకే మతం" అనేదే శ్రీ నారాయణగురువు ముఖ్యోపదేశము. ఈ దివ్య ఉపదేశాన్ని ప్రచారం

## ఎందుకు?

### నీరు ఎందుకు చప్పుడు చేస్తుంది?

**ఒక సీసాలో మంచి నీరు వంపినపుడు జల జలమని శబ్దం చేస్తుంది. వాతావరణంలో గాలి సీసాలో ప్రవేశించి శూన్యప్రదేశాన్ని నింపుతుంది కాబట్టి.**

చేయడానికి 1903 లో శ్రీ నారాయణ 'ధర్మ పరిపాలన యోగం' ప్రారంభింప బడింది. దీనికి శ్రీ నారాయణగురువే మొదటి అధ్యక్షుడు.

శ్రీ నారాయణగురు ఉపదేశాలకు ప్రేరితులై వేలకు వేలు యువకులు యోగంలో చేరి స్వచ్ఛందంగా సాంఘిక సేవకు పూనుకున్నారు. భారతదేశమందంతటా శాఖలు బయలుదేరాయి. ఆల్వాయిలో అద్వైతాశ్రమము, నీలగిరిలో నారాయణ గురుకులం వీటికి చెందినవే.

శ్రీ నారాయణగురు తిరువనంతపురం, కొచ్చిన్ సంస్థానాలు, తమిళనాడు, శ్రీలంకా మొదలగు ప్రదేశాలలో పర్యటించి తన ఉపదేశాలకు తగిన ప్రచారం, వ్యాప్తి కలిగించాడు. అనేక గ్రంథాలను రచించాడు. ముఖ్యంగా ఇతడు రచించిన "ఆత్మోపదేశ శతకం" ఇతడి భక్తులకు పవిత్రమైన గీత వంటిది. సరళమైన మలయాళ భాషలో తన దివ్య సందేశాన్ని మృదు మధురమైన సంగీతంలో రచించాడు.

తిరువనంతపురానికి 40 కి. మీ. ల దూరంలో శివగిరి అనే సహజ సుందరమైన ప్రదేశాన్ని చూచి అచ్చట తన ఉద్యమానికి ముఖ్య కేంద్రాన్ని ఏర్పరచుకున్నాడు. ఇచ్చట ఒక ఆశ్రమము, దేవాలయం నిర్మింపబడింది. బీద విద్యార్థులకు ఒక పాఠశాలను నెలకొల్పాడు. మహాత్మాగాంధీ, రవీంద్రనాథ్‌ఠాగూర్ ఈ పాఠశాలను సందర్శించి శ్రీ నారాయణగురు సాంఘిక సేవను వేనోళ్ళ పొగిడారు.

శ్రీ నారాయణగురు 50 ప్రార్థనా మందిరాలు నిర్మించాడు. మూఢ విశ్వాసాలను నిర్మూలించి సర్వ మానవసేవా ధర్మాన్ని ప్రచారం చేసాడు.

1924 లో శ్రీ నారాయణగురు ఆల్వాయ్‌లో అద్వైత ఆశ్రమంలో సర్వ మత సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. వైక్కోమ్ సత్యాగ్రహంలో పాల్గొని 21 నెలల పాటు అస్పృశ్యత నివారణోద్యమం కొనసాగించాడు. తిరువనంతపురం రాజు ఈ ఉద్యమ మహోన్నత ఆదర్శాన్ని గ్రహించి అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశానికి అనుమతిని కల్పించారు.

ఆమరణాంతం నిమ్నజాతుల సముద్ధరణకు పూనుకుని అందరిలో దేవుడున్నాడని వాదించిన శ్రీ నారాయణగురు సెప్టెంబరు 21, 1928 న మరణించారు.

## ఎవరైనా సరే...



బొటన వ్రేళ్ళమీద నిలుచుండే వాడు స్థిరంగా నించోలేడు. పెద్ద పెద్ద అడుగులు వేసి నడిచేవాడు నిలకడగా నడవలేడు. గొప్పలు చెప్పుకునే డాంబికుడు రాణించలేడు. స్వాభిలాషి ఇతరుల ఆదరాభిమానాలను పొందలేడు. కీర్తికోసం పాటుపడేవాడు ఎన్నడూ నాయకుడు కాజాలడు.

— టావో టి చింగ్

"తన్ను తాను రక్షించుకోలేని సమయంలో మానవుడు అహంకారాన్ని అడ్డు వేసుకుని జీవిస్తాడు."

సుమారు 1300-1400 మిలియను సంవత్సరాలకుపూర్వం ఇప్పుడున్న హిమాలయా పర్వతశ్రేణికి మధ్యఇండియా వింధ్య పర్వతశ్రేణికి నడుమ ఒక గంభీరమైన మహాసముద్రం ఉండేది. ఈ మహాసముద్రపు




పల్లంలో మన్ను, ఇసుక, ఇతర అనేక పదార్థాలు అతి మెల్లగా విలకడగా పొరలు పొరలుగా ఏర్పడి పేరుకుపోయాయి.

సముద్రంలో ఈ విధగా మడ్డి ప్రోగైన తరువాత అసలు కథ ప్రారంభమై హిమాలయ పర్వతాలు ఏర్పడ్డాయి. ద్వీపకల్పమైన భారతదేశం సముద్రంలో ఉత్తర దిక్కుగా జరగడం ప్రారంభించి,భూగర్భంలో జరుగుతూన్న సంక్షోభంవల్ల టిబెట్‌ను అద్దుకుంది. అతి శీఘ్రంగా సముద్రం లోతుకు దిగిపోయింది. ఉత్తర సరిహద్దులో పగుళ్ళు ఏర్పడ్డాయి. ఈ పగుళ్ళ నుండి విస్తారంగా నల్లటి పదార్థం పైకి వచ్చి హిమాలయ శిఖరాలు ఏర్పడ్డాయి.

సముద్రం క్రిందివైపు సన్నబడిపోయింది. దక్షిణ దిక్కుగా విస్తరించుకుంటూ మడ్డి పదార్థాలను పెకళించింది. 1400 మిలియను సంవత్సరాలపాటు నిలిచి ఉన్న సముద్ర జలాలు దక్షిణంగా ప్రవహించి సన్నపాటి పల్లం ఏర్పడింది.

విశాలమైన దళసరి మడ్డిపొరలు గట్టిగా ఒత్తిడితో అదుముకుపోయాయి. బాగా విరుసుకుపోయిన బ్రహ్మాండమైన పొరలు పైకి పర్వతాలుగా లేచాయి. పొరలు పైకి తన్నబడి హిమాలయ క్రింది ప్రదేశంలో రాతి పొరలు ఏర్పడ్డాయి. సిమ్లా (హిమాచల ప్రదేశ్), రాణిఖేట్, ఆల్మోరా (ఉత్తర ప్రదేశ్), డార్జిలింగ్ (ప. బెంగాల్) వగైరా ఆ రాళ్ళమీద బయలుదేరాయి.

లోతుగా క్రింద ఏర్పడిన ఒత్తిడివల్ల పైభాగం కరిగింది. ఈ విదంగా కరిగిన పదార్థం పైకి లేచింది. రాయిగా పేరుకుంది. ఇదే హిమాలయాలు. కేదార్‌నాథ్, బదరీనాథ్, గంగోత్రి (ఉత్తరప్రదేశ్) ఈ రాతి ప్రదేశాలలో ఉన్నాయి. హిమాలయాలకు ఎదురుగా సంకుచితమైన పల్లం ఏర్పడింది. హిమాలయాలు ఒరుసుకుపోయి మరో మడ్డి పొర ఏర్పడింది. ఇవి తిరిగి పర్వతాలుగా ఏర్పడ్డాయి. ఇవి క్రమంగా డెహరాడూన్, ఋషికేశ్, హరిద్వార్ (ఉత్తరప్రదేశ్) పరిసరాలలో శివాలిక్ పర్వతశ్రేణిలో చేరిపోయాయి. సుమారు 3 మిలియను సంవత్సరాల క్రితం భూగర్భంలో జనించే టెక్టానిక్ శక్తుల ప్రభావంవల్లే హిమాలయ పర్వతాలు ఏర్పడ్డాయి.

సి. పి. పరాంకుశం

వర్తులాకారంలో గీయబడిన రేఖ వృత్తం. ఇదే శూన్యము లేక సున్న. వృత్తము యొక్క ఆకారం సాధారణంగా మనందరికీ తెలిసినదే. దీనికి అంతగా ప్రాముఖ్యతను ఇవ్వము. కాని సావకాశంగా కూర్చుని ఆలో



చిస్తే దాని ఆకారం - బిందువు, సున్న, బిందుసున్న, అర్థసున్న మొదలైనవాటి ఉపయోగాలను పరిశీలిస్తే దానిని గౌరవించక మానం.

చిన్నప్పుడు మనం అందరం తోపుడు బండి - పెరంబులేటరులో కూర్చున్న వాళ్ళమే. అది ముందుకు జరగడానికి దానికి నాలుగు గుండ్రని చక్రాలు అమర్చబడి ఉంటాయి. కొంచెం పెద్దవాళ్ళం అయేటప్పటికి ఇక అందులో కూర్చోము. ట్రైసికల్ తొక్కుతాము. దానికి మూడు చక్రాలు. ఇంకా కొంచెం ఎదిగేటప్పటికి బైసికిల్, స్కూటర్, మోటార్ సైకిలు మొదలైనవి వాడతాం. దానికి రెండు చక్రాలు. బాగా పెద్ద వాళ్ళం అయేసరికి నిలకడ తక్కువైపోతుంది. తిరిగి నాలుగు చక్రాల కారుమీద తిరుగుతాము. రైళ్ళలో తిరుగుతాము. రోడ్డుమీద తిరిగినా, ఇనుప పట్టాలమీద తిరిగినా ఈ బళ్ళన్నిటికీ గుండ్రని చక్రాలే ఆధారం. కాబట్టి వాయువిమానాలు, నౌకలలో ప్రొపెల్లరులు వర్తులాకారంలో తిరుగుతుంటే అవి ముందుకు సాగుతూంటాయి. ఈ రాకపోకల సాధనాలన్నిటిలోను షాప్టులు, గియర్లు, ఇంకా ఇతర విడిభాగాలు ఉపయోగపడతాయి. ఈ విధంగా వర్తులాకారం మనకి ఒక విధమైన శీఘ్రమైన రాకపోకల సౌకర్యం కలిగించి

## మీరైతే....?

(ఫిబ్రవరి 1989)

('నిజమాడితే నిష్ఠూరం' అంటే:)

"నిష్ఠూరపరులకి నిజం విలువ తెలియదంటా!"

—భమిడిపాటి అప్పల నరసింహులు, నరసన్నపేట.

* * *

"ఎన్ని నిష్ఠూరాలు ఎదురైనా
నిజం దాచేస్తే దాగని సత్యం."

—కె. శ్రీరాములు, మదనపల్లి.

* * *

"నిష్ఠూరమైనా నిజమాడటమే
వివేకం అంటాను."

—కుమారి పి. అపర్ణ, తెనాలి.

సహకరించింది. దీనివల్ల కలిగే లాభాలు ఇన్ని అన్ని అని చెప్పలేము.

ఇంగ్లీషు వర్ణక్రమంలో 'O' అనే అక్షరం ఉంది. ఇది ఒక అచ్చు అక్షరము. వర్తులాకారంలో ఉంటుంది. చాలామటుకు ఇతర అక్షరాలు ఈ వృత్తభాగాన్ని ఉపయోగించే ఏర్పడ్డాయి.



ఇలాగే తెలుగులో అక్షరాలన్నీ గుండ్రంగా ఉంటాయి. మన అక్షర సమామ్నాయం ఆణిముత్యాల కోవలా ఏర్పడడానికి ఎన్ని ఏళ్ళు పట్టిందో! మొదట వంకర టింకర గీతలు రాతిబండలమీద, రాగిరేకుల మీద, తాటాకుల మీద, కాగితాల మీద రాపాడి రాపాడి ఇప్పటి సుందర స్వరూపాన్ని తీర్చిదిద్దుకున్నాయి. తెలుగులో సున్నను అనుస్వారం అంటాం. మకారానికి, అనునాసికానికి దీనిని వాడుతాం. అనుస్వార బిందువును పంక్తిలో వ్రాయడం తెలుగులో నన్నయనాటికే అలవాటయింది. మొదట దీనిని అక్షరంపైనగాని, కుడిప్రక్కగా గాని ఒక చుక్కగా పెట్టేవారు. ఈ చుక్క కనిపించక పోవచ్చనే ఉద్దేశంతో బిందుగా చంద్రమండలంలాగ గుండ్రంగా వ్రాసే అలవాటయింది.

గణితశాస్త్రంలో సులభతరమైన దశాంశ విధానం సున్నవల్ల ఏర్పడినదే. సున్నవల్ల గణితశాస్త్రం ఎంతో సులభమైంది. అది లేక పోతే ఎంతో కష్టమైపోయి ఉండేది.

నిత్యజీవితంలో కూడా మనం ఉపయోగించుకునే వస్తువులు, ఉపకరణాలు తయారు చేసుకోవడానికి గుండ్రని 'సున్న' ఆకారం ముఖ్యమైన పాత్ర వహించింది. విరామ చిహ్నాలు - ఫుల్‌స్టాప్, బ్రాకెట్లు వగైరా అన్నీ సున్నలో నుంచి ఏర్పడినవే. చిన్నప్పుడు మనం వ్రాయడం నేర్చుకునేటప్పుడు మొట్టమొదట సున్నలు చుట్టిస్తారు. అందరూ సులభంగా చేత్తో సున్న చుట్టేస్తారు. కానీ అది కచ్చితంగా గుండ్రంగా ఉండదు. ప్రకృతిని పరిశీలిస్తే సూర్యబింబం, చంద్రబింబం, భూమి, ఇతర గ్రహాలు, వాటి భ్రమణ మార్గాలు అన్నీ వర్తులాకారంలోనే ఉంటాయి. భూమిమీద రకరకాల పళ్ళు, విత్తనాలు, దుంపలు. చెట్లు వాటి కొమ్మలు అన్నీ దగ్గర దగ్గరగా వర్తులాకారంలోనో లేక వృత్తభాగాలుగానో ఉంటాయి.

మానవ శరీరంలో వివిధ నరాలు, రక్తనాళాలు, కేశాలు అడ్డుకోత దృశ్యంలో వర్తులాకారంలో ఉంటాయి. అనేక ప్రాణుల కళ్ళు, చెవి రంధ్రాలు అన్నీ గుండ్రంగానే ఉంటాయి. ముఖ్యంగా బట్టతల అయినప్పుడు గుండ్రంగా పొన్నకాయిలా ఉంటుంది. ఎటువంటి ద్రవపదార్థమైనా సరే జారి చుక్కలు చుక్కలుగా క్రింద పడుతున్నప్పుడు బిందువులు గుండ్రంగా ఉంటాయి. వాన చినుకులు గుండ్రంగా ఉంటాయి. ఇవన్నీ పరిశీలిస్తుంటే వర్తులాకారం భగ

"శ్రవణశక్తి ఉంటే హృదయంలో

వంతుని సృష్టి తత్త్వంలోనే ప్రాతిపదికగా ఏర్పడిందా అనిపిస్తుంది.

ఈ వర్తులాకారం ఎప్పుడు ఎక్కడ ప్రారంభమైందో తెలుసుకోవడం చాలా కష్టం. అలాగే దీనిని ఎవరు కనిపెట్టారు అనేది తెలుసుకోవడం కూడా సులభసాధ్యం కాదు. అనాది నుంచి ఇది వాడుకలో ఉంది. రాతియుగంలో ప్రజలు మొట్టమొదట దీనిని తెలుసుకుని ఉండవచ్చు. రాను రాను తరువాతి వారు దాన్ని ఉపయోగించడం ప్రారంభించారు.

నాగరికత పెరిగిన కొద్దీ వృత్తం ఉపయోగం పెరుగుతూ వచ్చింది. దీన్ని ఉపయోగించిన కొద్దీ నాగరికత అభివృద్ధి పొందుతూన్నదనే చెప్పుకోవాలి. దీని ఉపయోగం వల్ల జీవిత సమస్యలు ఎన్నెన్నో సులభసాధ్యమవుతున్నాయి. దీని ఉపయోగానికి అంతు లేదు.

వృత్తం మనకు జీవితంలో అనేక సౌకర్యాలను ఇస్తుంది. భగవంతుని తరువాత అంత శక్తివంతమైనది ఈ సున్న.

ఒకటి, రెండు, మూడు....అంకెలలో ఒకటి విలువ చాలా చిన్నది. రెండు కంటే తక్కువ. కానీ ఆ ఒకటికి కుడిప్రక్క ఒక సున్న చేరిస్తే దాని విలువ పది అయిపోతుంది. పదికి ఇంకో సున్న చేరిస్తే దాని విలువ నూరు అయిపోతుంది. ఈ విధంగా ఒకటికి సున్నలు చేరుస్తూ దాని విలువ ఎంత ఎక్కువగానైనా పెంచవచ్చు. కానీ ఒకటిని కొట్టివేస్తే, సున్నకు విలువ లేదు. దీనినిబట్టి లోకంలో అద్వితీయుడగు దేవుని ఆశ్రయింపనిదే జీవునకు విలువ లేదని తెలుసుకోగలుగుతున్నాము. భగవంతునితో సంబంధము చేతనే విలువ ఏర్పడుతుంది. సున్నలో సగం ఎంత? తిరిగి దానిలో సగం ఎంత? ఎన్ని సగాలు చేసినా అవన్నీ చివరకు సున్నలే అవుతాయి. అఖండమైనదానికి ఖండ ఖండాలుగా చీల్చినా తుదకు ప్రతీ ఖండము అఖండమే అవుతుంది. ఇదే మన తత్త్వం.

## ప్రాచీన ఈజిప్టులో దైవం



ప్రాచీన ఈజిప్టులో పిల్లి దైవంగా పూజింపబడేది. ఈజిప్షియనుల ముఖ్య దేవతలు 'రా' (Ra) మరియు 'ఐసిస్' (ISIS) లకు చిహ్నం పిల్లి. దేవాలయంలో పిల్లి ఎప్పుడైనా మరణిస్తే ఊరి జనం అంతా దానికోసం దుఃఖం పాటించేవారు. ఇంట్లో పిల్లి మరణిస్తే కుటుంబం అంతా కనుబొమ్మల వెంట్రుకలను తీయించుకుని సంతాపాన్ని ప్రకటించేవారు.

[illegible]

రీనా థామస్

పెంపుడు పక్షులలో మొట్టమొదటివి జల పక్షులు. వీటిలో సుమారు 147 వివిధ జాతులు జలపక్షులుగా వర్గీకరింపబడ్డాయి.

భారతదేశంలో "బ్రాహ్మణి బాతు" అని చెప్పబడే రుడ్డీ షెల్‌డక్ (Ruddy shel_duck) చాలా పెద్దది. పూర్తిగా ఇటుక రంగులో ఉంటుంది. ఇది ఎంత దూరంలో

WATER FOWL

ఉన్నా సుస్పష్టంగా కనిపిస్తుంది. వీటికి దృష్టి మిక్కిలి సూక్ష్మంగా ఉండటంచేత ఏదైనా అపాయం సంభవిస్తుందని కనిపెట్టిన వెంటనే మరో ప్రక్కకు తప్పుకుని సంరక్షించుకుంటాయి.

రుడ్డీ షెల్‌డక్ బాతులు ఎక్కువగా టిబెట్‌లోను, కాశ్మీరులోను, జీవిస్తాయి. శీతాకాలంలో ఇవి గుంపులు గుంపులుగా దక్షిణదిక్కుగా భారతదేశంలో సౌరాష్ట్ర, కచ్ మరియు గుజరాత్ మొదలైన ప్రదేశాలకు వలసలు పోతూంటాయి.

పేరుకు తగినట్టుగా వీటికి రంగురంగుల ఈకెలు ఉంటాయి. షెల్డ్ అనే మాటకు నానా వర్ణములు అని అర్థము. పెరిగిన మగ బాతుకి తల, మెడ లేతపసుపు మీగడ వర్ణంలో ఉంటుంది. ఈ రంగు రానురాను ముఖంమీద వెలవెలపోతుంది. మగపక్షికి మెడచుట్టూ నల్లరంగు ఉంటుంది. జత కూడిన తరువాత ఈ నల్లరంగు పూర్తిగా గానీ, కొంతవరకుగానీ పోతుంది. ఆడబాతు ముఖం మీద తెల్లమచ్చ ఉంటుంది. వీటికి మెడచుట్టు నల్లరంగు ఉండదు. ఇవి చెట్లు,

## సుభాషితాలు

ఈగ తేనె రుచికి వింపుగా చచ్చును
ఓగు కామరుచికి నొదిగి చచ్చు
త్యాగి కాని వాని ధర్మమడ్గిన జచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ!

[తేనె రుచి చూచుటకు వచ్చిన ఈగ అందులో చిక్కుకుపోయి చచ్చిపోతుంది. అవివేకి కామానికి లొంగి నశిస్తాడు. ధనమడిగిన వెంటనే లోభి ప్రాణాలు పోతాయి.]

* * *

అనగ ననగ రాగ మతి రమ్యమైయుండు
పెనగ పెనగ సతికి ప్రేమపుట్టు
తినగ తినగ వేము తియ్యనై యుండురా
విశ్వదాభిరామ వినుర వేమ!

[అభ్యాసం చేయగా చేయగా రాగం ఇంపుగా ఉంటుంది కలసిన కొద్దీ యువతికి ప్రేమ పెరుగుతుంది. తినగా తినగా చేదుగా ఉండే వేపచిగుళ్ళు తియ్యగా ఉంటాయి.]

[illegible]

చేపలు లేని శుభ్రమైన నీటిప్రదేశాల దగ్గర, ఇసుకగట్లమీద నివసిస్తాయి. జతలు జతలుగా నీటి గట్లమీద నడుస్తూంటాయి. నీటిలో బాగా ఈదగలిగినా ఇవి సాధారణంగా నీటిలో దిగవు. భూమిమీద ఇవి సునాయాసంగా నడుస్తాయి.

పగటిపూట ఇవి ఒకదాని ప్రక్క ఒకటి నిలుచుండి విశ్రాంతి తీసుకుంటాయి. రాత్రి పూట విడిపోయి విడివిడిగా ఆహారం కోసం సంచరిస్తాయి.

ముఖ్యంగా రకరకాలగడ్డి, నీటి మొక్కలు, వరి, ధాన్యం, నత్తలు, చిన్న చిన్న చేపలు, పురుగులు, వాటిలార్వా, ఉభయచరాలు మొదలైనవి వీటి ఆహారం.

జతలు జతలుగా ఏర్పడడానికి మొదట ఆడబాతులే ప్రాతినిథ్యం తీసుకుంటాయి. ఆడబాతు మగబాతును ఎన్నుకుంటుంది. ఇవి జత కూడేటప్పుడు చాలా ఉగ్రంగా ప్రవర్తిస్తాయి.

ఆడబాతులు నదిగట్లమీద, ఇసుక గోతుల లోను. చరియలలోను, చెట్లలోను, పొదల లోను ఈకలతో గూళ్ళు నిర్మిస్తాయి. సాధారణ పరిమాణంలో 6 మొదలు 10 నున్నని తెల్లనిగ్రుడ్లను పెడతాయి. ఆడ బాతు ఈ గ్రుడ్లను సుమారు 28 రోజుల పాటు పొదుగుతుంది. బాతుపిల్లలు తల్లి బాతులా ఉన్నా ముదురు ఇటుక రంగులో ఉంటాయి. వీటికి రెక్కలు బాగా పెరిగే దాకా తల్లిబాతు, తండ్రిబాతు 8 వారాల పాటు పెంచుతాయి.

జలపక్షులలో ఇవి చాలా ఉగ్రమైనది. వేటగాడిని, సామాన్య గ్రామస్తుని ఇవి సులభంగా తెలుసుకోగలవు. వీటిమీద ఆధారపడి వీటిని తినే ఇతర పక్షులు ఏవీలేవు. నీటిలో నిద్రపోతూన్న మొసళ్ళకు ఈ బ్రాహ్మణి బాతులే వేటగాళ్ళ అపాయాన్ని మొట్టమొదట తెలియజేస్తాయి.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## యూరప్‌లో మానవ నిర్మితమైన మిక్కిలి పెద్ద సరస్సు



నార్తంబర్‌లాండ్ (బ్రిటన్)లో 1982 లో నిర్మాణం పూర్తి కావిడిన కీవ్‌డెర్ డామ్ మరియు రిజర్వాయరు స్కీము యూరప్‌లో మానవులు నిర్మించిన మిక్కిలి పెద్దసరస్సు. దీని వైశాల్యం 1,086 హెక్టేరులు. 2,00,000 మిలియను లీటర్ల నీరు కలిగి పరిశ్రమలకు నీటి అవసరాన్ని తీర్చడమే గాక ఈశాన్య దిక్కుగా 85 శాతం జనాభాకి నీటి సౌకర్యం కలిగిస్తుంది. పశ్చిమ యూరప్‌లో ఇది మిక్కిలి పెద్ద బ్రహ్మాండమైన నీటి వనరు.

నీకు ఉపయోగపడని మనిషిపట్ల ప్రవర్తించిన తీరునుబట్టే వ్యక్తిత్వాన్ని అంచనా వెయ్యి.



కోసూరి శీలామాధవ్

ఎర్రటి కుంకుమం నొసటిమీద గుండ్రంగా తిలకం దిద్దుకోవడం భారతీయుల ప్రాచీన సాంప్రదాయం. శుభ్రంగా కడుగుకున్న ముఖానికి ముత్యమంత పసుపు పట్టించుకుని నొసటిమీద ఎర్రటి కుంకుమబొట్టు పెట్టుకుని, కళ్ళకు కాటుక తీర్చిన స్త్రీ ముఖం కళకళ



లాడుతూ ఉంటుంది. ఎంత సింగారించుకున్నా ముఖంమీద కుంకుమబొట్టు లేకపోతే స్త్రీ ముఖం వెలవెలబోతూ ఏదో వెలితిగా కనిపిస్తుంది. స్త్రీలకు పసుపు కుంకుమలు సౌభాగ్య సూచకములు. స్త్రీకి నొసటిమీద ఎర్రని కుంకుమబొట్టు ముత్తయిదువ తనాన్ని సూచిస్తుంది. అందుకే ముత్తయిదువలకు ఉత్తరాలు వ్రాసేటప్పుడు 'హరిద్రా కుంకుమ శోభిత' శేషమ్మ, రాధమ్మ, పద్మావతి ఫలానా వారికి అని పేరుకు ముందు పసుపు కుంకుమలతో శోభిస్తున్న అనేపదం వ్రాస్తారు.

స్త్రీలకు ముఖంమీద తిలకం దిద్దుకోడం రానురాను. ఒక కళగా ఏర్పడింది. ఏ కళకైనా అవశ్యకత ఉంటేకాని నవ్యకల్పనా సామర్థ్యం ప్రవృద్ధి పొందదు. స్త్రీ తన ముఖ సౌందర్యాన్ని పెంపొందించుకుని మరింత ఆకర్షణీయంగా కనబడడానికి ముఖానికి తగినట్టుగా తిలకం దిద్దుకోడం ప్రారంభించింది. ఎవరికి వారే ఒకరికంటే ఒకరు ఎక్కువ అందంగా కనిపించాలనే ఉబలాటం కొద్దీ పోటీతో స్త్రీలు వివిధ రకాలుగా తిలకం దిద్దుకుంటారు. కనుబొమ్మలకు మధ్యగా ముక్కుకు పైన నొసటిమీద గుండ్రని ఎర్రని బొట్టు అందరూ ధరిస్తారు. గుండ్రంగా పెట్టుకునే బొట్టే కొంతమంది నిలువుగా పెట్టుకుంటారు. కొంతమంది చింతాకులా దిద్దుతారు. కొంతమంది దోసగింజ బొట్టు పెట్టుకుంటారు. మరికొందరు గుమ్మడిగింజ బొట్టు పెట్టుకుంటారు. కల్యాణం బొట్టు పెట్టుకునేవారు కొంతమంది, నక్షత్రంలా బొట్టును దిద్దేవారు కొంతమంది. వారి వారి ముఖ లక్షణాలకు అనుగుణ్యంగా కొంతమంది నిలువుబొట్టు క్రింద గుండ్రటి చిన్న చుక్క పెడతారు. కొందరు అర్ధ చంద్రాకారంలో గంధం అద్ది మధ్య గుండ్రని బొట్టు పెట్టుకుంటారు. అభిరుచిని, అవశ్యకతను బట్టి వివిధ ఆకారాలలో తిలకం దిద్దుకోడం సాంప్రదాయమైంది. నొసటి మధ్యభాగంలో ఆత్మ ఉంటుందని హిందువుల నమ్మకం దీని సూచనగా ముఖంమీద ఎర్రబొట్టు ధరిస్తారు.

క్రమక్రమంగా బుద్ధి వికసిస్తున్న కొద్దీ కట్టిన చీర రంగుకు పొందికగా తగిన

"అంశజ్ఞానం అనుభవంలో అంశగా నిలవదు.
ప్రతి అంశం పూర్ణత్వానికి దారితీస్తుంది."

రంగులో మాచింగ్ చోళీ, వాటికి మాచింగ్ రంగులో కుంకుమబొట్టు, తలలో సాధ్యమైనంతవరకు మాచింగ్ రంగుల పువ్వులు పెట్టుకుంటారు.

శరీరంలో ప్రవహించె రక్తం ఎర్రని రక్తవర్ణంలో ఉంటుంది. ఎర్రరంగు ఆరోగ్యవంతమైన చైతన్యతను తెలియజేస్తుంది. అందుకే ఎర్రటి కుంకుమను బొట్టుగా పెట్టుకుంటారు.

ప్రాచీన కాలంలో ఆర్యులు కుంకుమకు అద్భుత శక్తులున్నాయని నమ్మేవారు. ఆనాటి పురుషులు స్త్రీలను వశపరచుకోడానికి సాధారణంగా ముఖంమీద ఎర్రని కుంకుమ బొట్టు పెట్టుకునేవారు. కామదేవత దిగ్విజయ సూచకంగా కుంకుమ పెట్టుకోవడం వాడుకైంది. ఆనాటి నుంచే కుంకుమబొట్టు స్త్రీ భార్యాత్వానికి సూచనగా ఏర్పడింది.

ఒక స్త్రీని అనేకమంది ప్రేమించి వివాహం చేసుకోడానికి పరస్పరం పోరాడి ప్రయత్నించి చివరకు దిగ్విజయం పొందిన నాయకుడు ఆమెపై తన హక్కును ప్రకటించుకోడానికి నాయకురాలి నొసటిమీద రక్తబిందువును తిలకంగా దిద్దడం ప్రాచీన ద్రావిడ సాంప్రదాయము.

కామసూత్ర కారకుడైన వాత్స్యాయనుడు పతిభక్తిని కోరే స్త్రీ అవలంబించవలసిన సూత్రాలను వివరించాడు. తనభర్త కలకాలం జీవించి ఉండాలని ఆశిస్తూ సమస్త భాగ్యాలను కోరుకునే స్త్రీ నొసటిపై కుంకుమనే కాదు పాపిట మధ్య సింధూరం కూడా ధరించాలి. నేటికీ బెంగాల్‌లో స్త్రీలు పాపిడిమధ్య సింధూరం అద్దుకుంటారు.

పద్మపురాణంలో, ఆగ్నేయపురాణంలో, పరమేశ్వర సంహితలో వివరింపబడిన ప్రమాణాలవల్ల స్త్రీలు చందనం లేక గోపీ చందనం నొసటిమీద చిన్ననామం దిదుకుని దానిమీద ముత్తయిదవలు పసుపుతో తయారు చేసుకున్న కుంకుమను బొట్టుగా అద్దుకోవాలి. ప్రతిదినం యథావిధిగా స్నానంచేసి ముఖానికి సౌందర్యపోషణ చేసుకున్న తరువాత మంచిగంధంతో లలాటంమీద ఊర్ధ్వపుండ్రం దిద్ది దానిమీద కుంకుమ తిలకం పెట్టుకోడంవల్ల భర్త ఆయుస్సు పెరుగుతుందని, నొసటిమీద కుంకుమబొట్టు ఎప్పుడు లక్ష్మీనివాస సూచకమని—

## కంటి రక్షణకు చిట్కాలు



* వైద్యుని సహాయం తీసుకునే చలువ జోళ్ళు ఉపయోగించాలి

* మధుమేహ రోగులు తప్పనిసరిగా రెండేసి సంవత్సరాలకు ఒక్కసారి కళ్ళ పరీక్ష చేయించుకుంటూండాలి

* సూర్యగ్రహణాలను మసిబారించిన అద్దాలతో చూడడం కూడా చాలా అపాయకరం. గ్రహణ బింబాన్ని నీటిలో చూడడం క్షేమకరం.

"ఊర్ధ్వపుండ్రం లలాటేతు
భర్తు రాయుష్య వర్ధకమ్
లలాటే కుంకుమంచైవ
సదా లక్ష్మీ నివాసకమ్."

అనే మంత్రం చెప్పుకుంటూ బొట్టు పెట్టుకోమని పురాణాలు ఆదేశించాయి.

ధైర్య సాహసోపేతుడైన రాజపుత్రుని భార్యకు కుంకుమం ధైర్య సాహసాలకు లక్షణం. తన భర్తను యుద్ధానికి పంపే రాజపుత్ర వనిత అతని ముఖంపై ఎర్రటి రక్తతిలకం దిద్దుతుంది. ఆ భర్త సజీవంగా యుద్ధం నుంచి తిరిగి రానప్పుడు తాను తిరిగి రక్తతిలకం ధరించి సహగమనం చేస్తుంది.

ఎరుపురంగు సజీవ చైతన్యానికి చిహ్నం. ఎర్రటి కుంకుమబొట్టు నొసటి మీద గుండ్రంగా పెట్టుకోడం దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యబింబాన్ని అనుసరించి గ్రహింపబడింది.

బీహారు, ఒరిస్సా కొండ జాతుల 'శాంతలు'ల వివాహతంతులో వధూవరులు తమ శరీరాలనుండి కొద్దిగా రక్తాన్ని తీసి రెంటిని కలిపి తరువాత ఆ రక్తాన్ని వరుడు వధువు నొసటిపై తిలకం దిద్దుతాడు. ఇది భార్యాభర్తల అన్యోన్య జీవితానికి సూచన.

ఇప్పుడు రెడీమేడు స్టిక్కర్ బొట్లు వివిధ రంగులలో, రూపాలలో లభిస్తున్నాయి. వివిధ రకాలుగా తిలకం పెట్టుకోడానికి లోహంతో తయారైన అచ్చులు, కుంకుమలు అమ్ముతున్నారు. మీ ఇంట్లో మీరే సులభంగా మంచి కుంకుమ తయారు చేసుకోవచ్చు. మంచిరకపు పసుపు కొమ్ములు (గుండ్రనివి) తగినంత నిమ్మరసంలో ఊరబెట్టి వాటిని నీడను ఆరబెట్టాలి. నిమ్మరసంలో ఊరి బాగా చెమ్మ ఆరిన పసుపు కొమ్ములకు కొద్దిగా వెలిగారం చేర్చి పొడిచేస్తే ఎర్రటి కుంకుమ తయారౌతుంది. మరి మీరూచేసి చూడండి. మీ ముఖం గుండ్రంగా పెద్దదిగా ఉంటే నిలువుబొట్టుగానీ, దోసగింజ బొట్టుగాని పెట్టుకోండి. ముఖం కొంచెం కోలగా చిన్నదిగా ఉంటే పెద్ద గుండ్రని బొట్టు పెట్టుకోండి. ముఖం కోలగా పెద్దదిగా ఉంటే గుండ్రని చిన్న బొట్టుఅందంగా ఉంటుంది. నక్షత్రం బొట్టు అందరికీ నప్పుతుంది.

## హవాయ్ అనాసకు ప్రసిద్ధి పొందింది



ప్రపంచంలో సరఫరా చేయబడుతూన్న అనాస పళ్ళలో మూడువంతులకు పైగా పసిఫిక్ మహాసముద్రంలో ఉన్న చిన్న చిన్న హవాయ్ దీవులలో పండింపబడుతున్నాయి.

"కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను
చూడగలవారే మనుష్యులందరిలో బుద్ధిమంతులు"

**నాలుగు గ్రహాలు భూమికన్నా పెద్దవి:**

సూర్య కుటుంబానికి చెందిన గ్రహాలలో నాలుగు గ్రహాలు భూమికన్నా చిన్నవి, నాలుగు భూమికన్నా మిక్కిలి పెద్దవి.



PLANETS & SUN

**టైటాన్ రెండవ పెద్ద చంద్రుడు:**

సౌర కుటుంబానికి చెందిన రెండవ పెద్ద చంద్రుడు టైటాన్-శనిగ్రహానికి చెందినది.

**సూర్యునికి అతి చేరువగా ఉన్న గ్రహం:**

సూర్యగ్రహానికి మిక్కిలి చేరువగా ఉన్న గ్రహం బుధుడు.

**భూమికి చేరువగా ఉన్న గ్రహం శుక్రుడు:**

భూమి తరువాత భూమి అంత పెద్దది భూమికి మిక్కిలి చేరువగా ఉన్నది శుక్ర గ్రహం.

**అస్టిరాయిడ్స్ అంటే ఏమిటి?:**

ఆస్టిరాయిడ్స్ అనబడే ఉపగ్రహాలు శిలల వంటి చిన్న చిన్న గ్రహాలు. ఇవి సూర్యుని చుట్టూ బుధ మరియు గురు కక్ష్యలలో తిరుగుతాయి.

**కుజగ్రహాన్ని "రెడ్ ప్లానెట్" అంటారు:**

కుజగ్రహాన్ని రెడ్‌ప్లానెట్ అంటారు. కుజగ్రహంలో ఉండే రసాయనిక ద్రవ్యాలు దానికి ఎరుపు నారింజవర్ణాన్ని కలిగిస్తాయి.

**ప్లూటో మిక్కిలి చిన్నగ్రహం:**

ప్లూటో అన్నిటికంటే మిక్కిలి చిన్న గ్రహం.

**తోకచుక్క అంటే?:**

కరిగిపోతూన్న పెద్ద మంచుగడ్డే తోక చుక్క.

**గ్రహానికి సంబంధించిన మాగ్నెటోస్పియరు:**

గ్రహం చుట్టూగల కాంతశక్తి ప్రదేశమే మాగ్నెటోస్పియరు.

**బాహ్యగ్రహాలలో మొట్టమొదటిది:**

బాహ్య గ్రహాలలో మొట్టమొదటి గురు గ్రహము.

**ఆశకు అంతు లేదు**

పగలు రాత్రి, ఉదయం సాయంత్రం, వసంతం శరత్కాలం ఒకదాని వెనుక ఒకటి వెళ్ళిపోతున్నాయి. ఋతువులు దొర్లిపోతున్నాయి. కాలం గడిచిపోతుంది. జీవితం ఉడిగిపోతుంది. కాని మనిషిని పట్టుకున్న ఆశ విడవకుండా ఉంది.

— ఆదిశంకరాచార్య (భజగోవిందం)

# మారుతూన్న కుటుంబ వ్యవస్థ–వృద్ధులు

సి. మోహనరావు, శ్రీకాళహస్తి.

మార్పు ప్రకృతి సహజం. మారుతూన్న కుటుంబ వ్యవస్థలో అవస్థలు పడుతూన్నవారు వృద్ధులు. ఇందులో అతిశయం లేదు. తాము జీవించి అందరి సుఖదుఃఖాలు పంచుకున్న సమిష్టి కుటుంబంలో ప్రస్తుతం జీవిస్తున్నది 'ఎవరికి వారే యమునాతీరే' వంటి వ్యష్టి కుటుంబం.

తమ పుత్ర పౌత్ర పోషణలో, ఆదరాభిమానాలతో వృద్ధాప్యం 'నల్లేరు మీద బండి నడకలా' సాగిపోతుందని వారు నిర్మించుకున్న ఆకాశ హర్మ్యాలు కూలిపోయాయని తెలుసుకుని హతాశులౌతున్న నిర్భాగ్య జీవులే వృద్ధులు. తమ కుమారుడు భర్తగా రూపాంతరం చెందిన తరువాత గొంగళి పురుగు పూర్వపు తన రూప లక్షణాలను వదలి సీతాకోక చిలుకగా మారినట్లు గుర్తించిన వృద్ధులు నిరాశ నిస్పృహలతో కాలం వెళ్ళబుచ్చ వలసి వస్తూంది.

ఇటు భర్తగా తన భార్యకు, పుత్రుడుగా తన తలిదండ్రులకు సమాన రక్షణ కల్పించాలనుకునే ఆ వ్యక్తి, ఇరుపక్షాలవారు ఆ వ్యక్తి సంపూర్ణంగా తమకే చెందాలని భావించడంతో ముందుకు వచ్చిన చెవులుకన్నా వెనుక వచ్చిన కొమ్ములే వాడి అన్నట్లుగా మిగిలిన జీవితకాలం గడపవలసిన భార్యాపిల్లలపైపే మొగ్గు చూపడం జరుగుతూంది. దీనివల్ల గృహచ్ఛిద్రాలు సంభవిస్తున్నాయి.

ఈ విషయంగా ఏర్పాటైన వృద్ధాశ్రమాలు వారికి కూడు, గుడ్డ, వసతి కల్పిస్తున్నాయే గాని మానసిక ప్రశాంతిని కలిగించడంలేదు. కనుక వృద్ధులు మారుతున్న కుటుంబ వ్యవస్థను అర్థం చేసుకుని మమతానురాగాలు తగ్గించుకుని విరాగ మనస్కులైతే వారికి ప్రశాంతత లభించినట్లే.

* * *

## భూకేంద్ర భాగంలో నిర్మింపబడిన దేవాలయం




మహాకాళి దేవాలయం నిర్మింపబడిన ఉజ్జయిని (మధ్యప్రదేశ్) భూమికి కేంద్రమని ప్రాచీన భారతీయ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. బ్రహ్మాండమైన ఈ దేవాలయం కేంద్రంగుండా గీయబడిన రేఖనుంచి భూమిమీద ఇతర అన్ని ప్రదేశాల దూరాలు లెక్కించబడతాయి.

బి.ఎస్. మూర్తి, కాకినాడ.

ఈనాడు వ్యష్టి కుటుంబాల సంఖ్య పెరిగిపోతూంది. స్వార్థం, స్వేచ్ఛ చేరిన ఆర్థిక వ్యవస్థే దీనికి ముఖ్యకారణం. రోజురోజుకి ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఏనాటి కానాడు జీవన ప్రమాణం హెచ్చిపోతూంది. ఈ పరిస్థితులలో కుటుంబంలోని వృద్ధుల స్థితి మిక్కిలి శోచనీయం. వయసు ఉడిగి పనీ పాటలు చేయలేని వారికి జీవితం ఒక సమస్యగా పరిణమిస్తుంది. కొడుకు లేక కుమార్తె చేరదీయకపోతే వారి జీవితం మరింత శోచనీయ మవుతుంది.

చాలా మంది వృద్ధులు తమ పిల్లలపై ఆధారపడి ఉండడం వలన వారి బ్రతుకు దయనీయంగా ఉంటుంది. ఆర్థిక సమస్యల కారణంగా యువత తమ వృద్ధులను విసుక్కుంటారు. ఈ దోషం చిన్నపిల్లలకు కూడా వ్యాపించి వాళ్ళుకూడా విసుక్కుంటారు. వృద్ధులను గౌరవించడం యువకుల కవీన కర్తవ్యం. నేటి యువతే రేపటివృద్ధులు.

వృద్ధులుకూడా యువతకి ఉపదేశాలు, ఉపన్యాసాలు చేయరాదు. శాంతంగా, ఆధ్యాత్మికంగా జీవితం గడుపుకుంటుంటే ఏ చింతా ఉండదు. యువకులుగా సంపాదించిన ధనం కొంత పొదుపు చేసుకోవాలి. అప్పుడు వృద్ధాప్యంలో ఎవరిపైనా ఆధారపడవసరం ఉండదు. వయసు ముదిరినా మనస్సు కదల కూడదు. ఉత్తేజంగా ఉండాలి.

* * *

పంతుల దక్షిణామూర్తి ప్రసాద్,
విజయనగరం.

మానవ జీవితం బాల్యం, కౌమారం, యౌవనం, వృద్ధాప్యం అనే నాలుగు అవస్థలలో కూడుకుని ఉంది. బాల్య, కౌమారాలు తలిదండ్రులు బాధ్యతగా గ్రహించి పోషిస్తే యౌవ్వనంలో స్వయం సంపత్తితో జీవించి వృద్ధాప్యంలో సంతతి ప్రాపు పొందవలసి వస్తుంది.

పూర్వం వృద్ధాప్యంలో లౌకిక బంధనాలను త్రెంచుకుని మునివృత్తిని అవలంబించి భగవత్ చింతనతో వానప్రస్థాన్ని స్వీకరించేవారు. అందుచేత ఆనాడు వృద్ధాప్యం ప్రశ్న కాలేదు. ఈనాడు సమిష్టి వ్యవస్థలో వృద్ధుల భారం అందరిపైన సమానంగా ఉంది. అయినా అధికార వ్యామోహం మేల్కొనడం చేత, ఆర్థిక అసమానతల వల్ల, ఈర్ష్య అసూయ పెచ్చుపెరగడంచేత, స్త్రీల పౌర

## టైలర్ పిట్ట


TAILOR BIRD

భారతదేశపు 'టైలర్ బర్డ్' అనే 'దర్జీ పిట్ట' చెట్లుమీద అమవుగా ఉండే మంచి ఆకును ఎన్నుకుని దాని అంచులు వంచి నారతో చేర్చి కుట్టి ఒక సంచిలా తయారు చేసుకుంటుంది. దాంట్లోనే ఇది గూడు కట్టుకుంటుంది.

"ఒక కార్యము సిద్ధించడానికి దైవ పౌరుషాలు రెండూ అనుకూలించాలి. కేవలం పౌరుషం చాలదు"

పొచ్చాల కారణంగా కుటుంబ వ్యవస్థ వ్యష్టి కుటుంబ వ్యవస్థగా రూపుదిద్దుకుంది. ఆ ఆస్తిని ఎక్కువగా పంచుకున్న సంతానం బాధ్యతను మాత్రం స్వీకరించడం లేదు. వృద్ధుల పోషణ భారమని తిరస్కరించిన వారు కొందరు, ఆ భారాన్ని పంచుకుని వృద్ధులను బంతాడినట్లు ఆడుకునే దౌర్భాగ్య స్థితికి దిగజారినవారు మరి కొందరు.

ఇట్టి వ్యష్టి కుటుంబ వ్యవస్థలో మారుతూన్న కాలానుగుణ్యంగా మారలేక, పరిస్థితులకు అనుగుణంగా మెలగలేక, ప్రేమానురాగాలను వదులుకోలేక, వృద్ధులు సతమతమవుతున్నారు.

ఇదేవిధంగా పిల్లలు పెద్దల అభిప్రాయాలను గౌరవించక, సమాధానపరచనూలేక వివేకంతో ఆలోచించక చివరకు కన్న తలిదండ్రులనే అనాధలుగా వీధిని వేయడం ఈనాడు మనం చూస్తున్నాము.

సాంఘిక మర్యాదలు మారని మన దేశంలో కాలమాన పరిస్థితులను అనుసరించి నేడు అనుసరిస్తూన్న పరిమిత కుటుంబ వ్యవస్థ ఫలితంగా రాబోయే తరాలలో వృద్ధుల జీవితం మరింత శోచనీయం కాగలదు. ఇతర దేశాలలో లాగే మన దేశంలో కూడా వృద్ధుల బాధ్యతలు ప్రభుత్వం స్వీకరించవలసి వచ్చినా ఆశ్చర్యపడక్కర్లేదు.

కానీ భారతదేశం ఆధ్యాత్మిక సంపన్నమైనది. కనుక ఇప్పటివరకు ఎన్ని కలతలు ఉన్నా భక్తి విశ్వాసాలతో, సంఘ మర్యాద కోసమే వృద్ధుల బాధ్యత చాలావరకు వారి సంతానమే స్వీకరిస్తూంది.

అయితే ఆ వృద్ధుల పోషణ భారంగాకాక బాధ్యతగా యువత తలచినప్పుడు, సంసార బంధాల కాంక్ష విడిచి వృద్ధులు ఆధ్యాత్మిక చింతనతో కాలం గడపగలిగినప్పుడు, కుటుంబంలో ఎన్ని మార్పులు ఏర్పడ్డా వృద్ధులు సమస్యాత్మక ప్రశ్నగా కాబోరు.

## ఆదర్శ పురుషుడు ఎవరు?



శారీరక బలం, మనోధైర్యం, సత్యసంధ్యత, మృదుస్వభావం, సౌజన్యత, ఆత్మస్థైర్యం కలవాడే ఆదర్శపురుషుడు. తనకంటే బలహీనునిపై ఇతడు చేయిచేసుకోడు. ఇతరుల దౌర్భాగ్యాన్ని దుర్వినియోగం చేసుకోడు. స్నేహితులను వంచించడు. ఇతరులను చాటుగా నిందించడు.

ఆత్మగౌరవాన్ని రక్షించుకోడమే అతని ముఖ్య లక్ష్యం. కులీనత, మర్యాద అతడి ఆభరణాలే. బలహీనులకు చేదోడు వాదోడుగా ఉంటాడు. అపాయ పరిస్థితులలో నిర్భయంగా ఉంటాడు. విజయం పొందినప్పుడు ఉబ్బిపోడు. తప్పుచేసిన వారిని క్షమిస్తాడు పసిపిల్లలపట్ల, జంతువుల పట్ల దయాదాక్షిణ్యంతో ప్రవర్తిస్తాడు.

— అనిబిసెంట్

"జ్ఞానము కన్నువంటిది, ధర్మము కాలువంటిది.
ఇవి లేనప్పుడు మానవుడు - గ్రుడ్డి కుంటి అవుతాడు."

ఉష్ణమండలాలలో లభించే అనేక ఫల జాతులలో ఘుమఘుమలాడే పరిమళంవల్ల, మాధుర్యంవల్ల, రుచివల్ల, రూపంవల్ల మామిడిపండు 'రాణి' అనిపించుకుంది. మామిడి అతిప్రాచీన కాలంనుంచీ ఇండియాలో సాగులో ఉంది. మన రామాయణ, భారతాలలో మామిడి తోటల (ఆమ్రవనాల) ప్రస్తావన ఉంది.




మాంగిఫెరా ఇండికా జాతికి చెందిన మామిడి మొట్టమొదట బంగాళాఖాతంచుట్టూ భూప్రదేశాలలో పుట్టింది. తరువాత ఇండియా అంతా విస్తరించుకుంది. అరబ్బీ వ్యాపారస్తులు దీనిని పర్షియా (నేటి ఇరాన్)లోను, ఈజిప్టు (ఉత్తర ఆఫ్రికా) లోను ప్రవేశపెట్టారు. క్రమక్రమంగా వ్యాపార నౌకలు వెస్ట్ ఇండీస్ (కరేబియన్ సముద్రం)లోను మరియు ఇతర ఉష్ణమండల ప్రదేశాలలోను ప్రవేశపెట్టాయి. ఈనాడు మామిడి చైనా, మలేషియా, ఫిలిప్పైన్స్, ఇండోనేషియా, ఆస్ట్రేలియా, దక్షిణ యుఎస్ఎ, మెక్సికో, వెస్ట్ ఇండీస్‌లలో విస్తారంగా పండించబడుతూంది.

మాంగిఫెరా జాతిలో 41 ఉపజాతులు ఉన్నాయి. వీటిలో మాంగిఫెరా ఇండికా, మాంగిఫెరా శిల్వాటికా శాఖలకు చెందినవే ఇండియాలో పండుతున్నాయి. ఇండియాలో పళ్ళ సాగుబడి ప్రదేశంలో సుమారు 60 శాతం మామిడి ఆక్రమించింది. బీహారు, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, పంజాబు రాష్ట్రాలలో మామిడి పుష్కలంగా పండుతుంది. వీటిని ముక్కలుగా కోసుకుని తినేవి, రసాలు పిండుకుని ఉపయోగించేవి, ఊరగాయకాయ, రెంటికీ ఉపయోగపడేవి అని నాలుగు రకాలుగా వర్గీకరించారు. ఇండియాలోనే 1000కి పైగా మామిడి రకాలు పండుతున్నాయి. వీటిలో సుమారు 350 రకాలు దక్షిణాదిని కనిపిస్తున్నాయి. చాలామటుకు విత్తనాలు (టెంకలు) నుండి మొలిచినవే. మంచిమంచి రకాలను రకరకాలుగా అంట్లుకట్టి, చేర్చికట్టి వ్యాప్తి చేస్తున్నారు.

పెద్దపెద్ద మామిడి తోటల స్వంతదారులకు మొగలాయి చక్రవర్తుల ఆదరణ లభించింది. కొన్ని ప్రత్యేకమైన మంచి మంచి రకాలకు ఆ మొగలాయిల పేర్లు సార్థకం చేసారు. ఇటువంటివే హుమాయుద్దీన్, జహంగీరు, నూర్జహాన్, ఆల్ఫాన్సో మొదలైనవి. రంగు, రుచి, పరిమళం, పరిమాణం, ఉపయోగం మొదలైన వివిధ గుణాలనుబట్టి మామిళ్ళకు

"విగ్రహారాధన గర్హనీయమని చాటిన ఆ గౌతమ బుద్ధునికే విగ్రహ రూపమిచ్చి ఆరాధించడం మానవ నైజం."

రకరకాల చిత్ర, విచిత్రమైన పేర్లు పెట్టారు. కొన్ని కొన్ని పేర్లు వింటూంటేనే మనకి నోరూరుతుంది!

బంగినపల్లి, చెరకురసం,పంచదారకలసి, రాజమాను, కొత్తపల్లి, కొబ్బరి, సన్నా కులు, ఏనుగుతల మొదలైనవి కోస్తా ఆంధ్రలో పండుతున్నాయి. తమిళనాడులో



పాదరీ, అల్ఫాన్జో, పీతార్, బెంగ్లోరా, బెన్‌షాన్ ప్రసిద్ధి. రాయలసీమలో రుమాని, నీలం, బనేషాన్ (బెనీషా). కలక్టరు రకాలు పండుతాయి. పశ్చిమతీరంలో ముండసా, నీలం, అల్ఫాన్జో ఓలర్, కరెపాడ్ పీతర్ ప్రసిద్ధిపొందినవి. ఉత్తర ఇండియాలో లంగ్డా, దాశేరి, సమర్ చేహిస్టు, ఫజిల్ మొదలైనవి లభిస్తాయి.

ఎన్నో రకాలున్నా అల్ఫాన్జో చాలా ఉత్తమమైన రకం అంటారు. అయినా చెరకు రసాలు, చిన్నరసాలు, పంచదార కలసి, బంగినపల్లి, నాగులాపల్లి, రసాలు వంటి ప్రధానమైన తూర్పు గోదావరి జిల్లా రకాలు అన్నిటిని మించాయి. మొదటి నాలుగు మాసాలపాటు వర్షపాతం అధికంగా ఉండి తరువాత పొడిగా ఉండే ప్రదేశాలలో మామిడి బాగా పూత తొడిగి పిందె దిగుతుంది. ఎక్కువగా తేమగా ఉండే ప్రదేశాలలో ఇవి బాగా వర్ధిల్లవు. పూత, కాపు, పండు అన్నీ వేసవి కాలంలోనే జరిగిపోతాయి. ఇది సుమారు 5 మాసాలపాటు జరుగుతుంది. పూతసమయంలో వర్షంవల్ల, మంచువల్ల, మేఘావృతమైన వాతావరణం వల్ల పూత ఫలదీకరణం చెందదు. పిందె దిగదు. పూత రాలిపోతుంది.

మామిడి అనేక రకాల అరిష్టాలకు, తెగుళ్ళకు లోనవుతుంది. మామిడికి గొల్లభామ, వల్లదిమ్మ తెగులు, చెంకపురుగు, పండుఈగ, తవిటి పురుగు, పిండినల్లి, మంచు తెగులు మొదలైన బీడలు పడుతూంటాయి. సాధారణంగా చిగురు, పూత పాడు చేసే నల్లమచ్చ తెగులు (ఆంత్రక్నోస్), పుల్లవిరుగు, నల్లమచ్చ కుళ్ళు, వేరుతెగులు మొదలైనవి పంటలకు చాలా హాని కలిగిస్తాయి. వీటిని నివారించడానికి సకాలంలో కనిపెట్టి క్రిమి సంహారక ఔషధాలు వాడాలి. మన దేశంలో అంటుతొక్కడం, చేర్చికట్టడం, మొగ్గంటు మొదలైన పద్ధతుల ద్వారా మామిడిని వ్యాప్తి చేస్తున్నారు.

అంటుమామిడి అంటుపాతిన నాలుగవ సంవత్సరం నుంచీ కాపుకు వస్తుంది. మొక్క ఎనిమిది సంవత్సరాలకు కాపుకు వస్తుంది. మామిడి తోటలు 30, 40 సంవత్సరాలు బాగా ఫలిస్తాయి. క్రమక్రమంగా క్షీణించిపోతాయి.

ఉత్తర ఇండియాలో కొన్ని రకాలు రెండు సంవత్సరాలకొకసారి కాపుకాస్తాయి. దక్షిణాదిని నీలం, బెంగ్లోరా, బనేషాన్,

(మిగతా 64 వ పేజీలో)

ఏప్రిల్ 1989

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుఠావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15 లు, రూ. 10 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకే సారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: ఏప్రిల్ 20, 1989. పంపవలసిన చిరునామా పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్‌డమ్' 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

— సంపాదకుడు

## వ్యాసం

"మహత్తర స్వస్తతకారి - కాలం" అనే అంశం మీద 200 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసిపంపండి.

## క్విజ్

1. భారతదేశంలో రాజ్య పరిపాలనను (territorial rule) స్థాపించిన మొట్టమొదటి యూరోపియన్ దేశమేది?

(ఎ) నెదర్‌లాండ్స్, (బి) ఇంగ్లండు, (సి) స్పెయిన్, (డి) పోర్చుగల్.

2. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి ఎవరు?

(ఎ) మోతీలాల్ వోరా, (బి) గోవింద్ నారాయణ్ సింగ్, (సి) అర్జున్ సింగ్, (డి) బ్రిజ్ మోహన్.

3. మానవ శరీరంలో మిక్కిలి పెద్ద అంగము:

(ఎ) మెదడు, (బి) హృదయము, (సి) లివరు, (డి) కిడ్నీ.

4. రాజ్యసభ సభ్యుడు ఎన్ని సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడతాడు?

(ఎ) 4 సంవత్సరాలు, (బి) 5 సంవత్సరాలు, (సి) 6 సంవత్సరాలు, (డి) 7 సంవత్సరాలు.

5. ప్రసిద్ధి పొందిన మీనాక్షి దేవాలయం ఎక్కడ ఉన్నది?

(ఎ) మధురై, (బి) చిదంబరము, (సి) బేలూరు, (డి) కాంచీపురము.

6. జవహర్‌లాల్ నెహ్రూ ప్రోత్సాహంతో ప్రారంభింపబడిన ఆంగ్లేయ వార్తాపత్రిక ఏది?

(ఎ) లీడర్, (బి) నేషనల్ హెరాల్డ్, (సి) లిబరేటర్, (డి) పయొనీర్.

7. ప్రస్తుత శతాబ్దంలో ఔషధరంగంలో ముఖ్యంగా కనిపెట్టబడినది ఏది?

(ఎ) ఆస్ప్రిన్, (బి) పెనిసిలిన్, (సి) ఆంటీసెప్టిక్ సర్జరీ, (డి) ఆంటీ రాబీల టీకా మందు.

8. 'సిల్లీపాయింట్' ఏ క్రీడకు సంబంధించినది?

(ఎ) బ్రిడ్జి, (బి) క్రికెట్, (సి) గోల్ఫ్, (డి) టెన్నిస్.

## పజిల్

అధారాలు - అడ్డం: 1. సాధారణంగా తొందరపాటువల్ల మంచి చెడ్డల విచక్షణాశక్తి లోపిస్తుంది, 3. ఇరవై యేడు నక్షత్రాలలో ఒక నక్షత్రము, 5. పరి



శ్రమలు అభివృద్ధి పొందుతున్న కొద్దీ పరిసర వాతావరణంలో దీని ప్రభావం అధికమవుతుంది, 6. అడ్డు మూడులాగే ఇది మరొకటి, 7. వైష్ణవసన్యాసి, 8. విమానాలు ఇందులో సంచరిస్తాయి, 10. సంతోషం అని అర్థమిచ్చే మాటతో 'మూడు' చేరింది, 11. ఈ తిథినాడు చంద్రుడు తానే కనిపిస్తాడు అంటారు, 12. తిరిగిరావలసిన సొమ్ము అని అర్థమిచ్చే హిందీ మాట తెలుగులో వాడతారు, 13. బండికి కట్టే ఎద్దు, 14. విరితావులు అనే పదంలో అక్షరాలు చెల్లాచెదరైనాయి.

నిలువు: 1. జాజి పూవులలో ఒక రకం, 2. సాధారణంగా హిందువులు ప్రతి రోజూ ఉదయం ఇండ్ల ముందర వీటి వి పెట్టడం వాడుక, 3. నవరత్నాలలో పచ్చకు పేరులో అక్షరాలు మారాయి, 4. కుమతి కాదు, 5. సత్పురుషుని లక్షణము, 6. స్నేహం చెడిపోవడానికి కారణం, 8. ధైర్యముగల స్త్రీ, 9. రహస్యముగా ఒకరి పక్షమున ఉన్న, 10. బంగారము అను పదము వెనుక నుంచి ముందుకి, 11. చెట్టు, 12. ప్రేమసూచకము.

## ప్రపంచానికి బైట ఎవరైనా ఉన్నారా!

భక్తుడు: ప్రపంచంలో నివసిస్తూ ఒక మనిషి భగవత్సాక్షాత్కారం పొందగలడా?

స్వామి బ్రహ్మానంద: ఈ ప్రపంచానికి బైట ఎవరైనా ఉన్నారా?

## యూరప్‌లో మిక్కిలి పెద్ద అక్వేరియమ్

యూరప్‌లో మిక్కిలి పెద్ద అక్వేరియమ్ పశ్చిమ జర్మనీ బెర్లిన్ జూలాజికల్ గార్డెన్స్‌లో ఉంది. ప్రతి దేశం నుంచి సేకరింపబడిన 5000 పైటి జంతువులను ఇక్కడ చూడవచ్చు.

"జీవితంలో మధురక్షణాలన్నీ పోగుచేసుకుని ఉంచండి [illegible] అవే పెద్దతనంలో [illegible]

## విస్డమ్
## పోటీల కూపను
### ఏప్రిల్ 1989

1. ప్రస్థానత్రయము అంటే ఏమిటి?

2. సరకుల ఉత్పత్తికి, అమ్మకానికి లాభదాయక పరిస్థితులను నెలకొల్పేందుకూ, గరిష్ఠలాభాలను గణించేందుకూ జరిగే పోరాటాన్ని ఏమంటారు?

3. షొరాబ్ అండ్ రుస్తుమ్, మాథ్యు ఆర్నాల్డ్‌కి గల సంబంధ మేమిటి?

4. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ మొట్ట మొదటి అధ్యక్షురాలు ఎవరు?

5. ఈ క్రిందివరుసలో తరువాతి రెండు సంఖ్యలు ఏవి?

1, 10, 3, 9, 5, 8——?

6. ఈ వరుసలో ఇముడనివి ఏవి?

బుధుడు, ప్లూటో, కుజుడు, గురుడు, యురేనస్, సూర్యుడు, చంద్రుడు.

7. క్రిందివాటిని సూచించుటకు తెలుగులో సమాసపూర్వకములైన పదాలను వ్రాయండి.

(ఎ) ఒకరిని ఆశ్రయించి జీవించువాడు

(బి) ముఖ్యమైన మందుతో కూడా సేవింపనది

(సి) తరువాత పుట్టినవాడు

(డి) కాలమునకు తగినది

8. "శ్రీకంఠ చాపఖండన
పాకారి ప్రముఖ వినుత భండన
విలస
త్కాకుత్స్థ వంశ మండన
రాకేందు యశోవిశాల
రామనృపాలా."

—అని ప్రార్థించినది:

(ఎ) రామదాసు తన పాటలలో, (బి) త్యాగరాజు తన కీర్తనలలో, (సి) పోతన భాగవతంలో, (డి) వీరెవరూ కాదు.

## మీసాలే సహజమైన వడపోత సాధనం



సున్నగా క్షవరం చేసుకున్న వారు అధికంగా ఊపిరితిత్తుల రోగాలతో బాధపడతారని, ధూళికణాలు నాసికా రంధ్రాల ద్వారా శరీరంలో ప్రవేశించకుండా పెద్ద పెద్ద మీసాలే సహజమైన వడపోత సాధనంగా వినియోగపడతాయని న్యూఢిల్లీలో ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో డెర్మటాలజీ ప్రొఫెసరు డా. జె. ఎస్. పాస్రిచా అభిప్రాయాన్ని తెలియజేస్తున్నారు.

[illegible] అనిపిస్తుంది.
[illegible] అనిపిస్తుంది.
జీవించడం తెలియనివానికి జీవితం దుర్భరమనిపిస్తుంది.

## వినోదమ్
## పోటీల కూపను
### ఏప్రిల్ 1989

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను సూచించండి.

1. ఇంపు: తీపి (ఎ) సంతోషము (బి), అందము (సి), వలపు (డి).
2. ఇక్కట్టు: ఇబ్బంది (ఎ), ఇరుకైనది (బి), స్థానము (సి), సంకేత స్థలము (డి).
3. ఈసు: అసహనము (ఎ), కోపము (బి), పగ (సి), నింద (డి).
4. ఉద్ది: సమానము (ఎ), ఎదిరి (బి), సాటి (సి), జత (డి)
5. ఏడుగడ: రక్షకుడు (ఎ), నియంత (బి), చెవిటివాడు (సి), వేగము (డి).
6. ఒచ్చెము: అవమానము (ఎ), మానహాని (బి), తప్పు (సి), కపటము (డి).
7. ఒడుపు: వీలు (ఎ), టక్కు (బి), మాయ (సి), గెలుపు (డి).
8. అదప: రక్షకుడు లేనిది (ఎ), దిక్కుమాలినది (బి), ఆకుల మడత (సి), ఒక రకం కత్తెర (డి).

## ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసిపంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

"సహనము, సర్దుబాటు, ప్రజాసామ్య సిద్ధాంతం" అంటే మీరు ఏం అంటారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## విద్య అంటే ఏమిటి?



విద్య అంటే ఏ శ్రమా లేకుండా కుర్చీలో కూర్చుని గ్రంథాలు చదవడం కాదు. అలా చదవడం గొప్పేకావచ్చు కాని అది అసలైన విద్య అనిపించుకోదు విద్యకు రెండు ముఖ్య లక్షణాలు ఉండితీరాలి. మానవుణ్ణి ఉదాత్తుడిగా మార్చగల లక్షణం ఉండాలి; దాంతోపాటు మానవుణ్ణి ఉత్సాహపరచే ఉత్పాదక లక్షణం ఉండాలి. —నెహ్రూ

(ఫిబ్రవరి 1989)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి: కుమారి సి. అపర్ణ, తెనాలి; రెండవ బహుమతి: వారణాసి పాపయ్యశాస్త్రి, విజయనగరం; మూడవ బహుమతి: సి. మోహన్‌రావు, శ్రీ కాళహస్తి, (చిత్తూరు జిల్లా).

క్విజ్ - జవాబులు: 1. (డి) జెయిల్ సింగ్, 2 (ఇ) విశాఖపట్టణం, 3. (బి) డిగ్బాయ్, 4. (ఇ) మేఘాలయా, 5. (ఎ) భూతలం క్రింద టెక్టానిక్ (Tectonic) శక్తులు. 6. (డి) భువనేశ్వర్, 7. (ఎ) బాల్య వివాహాలు, 8. (డి) మెదడు క్రింది భాగము.

విజేతలు - మొదటి బహుమతి: పి. ఎన్.ఎస్.బి.జి. కృష్ణ, పంగిడిగూడెం, (ప. గో. జిల్లా); రెండవ బహుమతి: ఎమ్. మారుతిదేవి, కడప; మూడవ బహుమతి: ఎమ్. పట్టాభిరామ్, జట్నీ (ఒరిస్సా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. అక్కరకు రాని చుట్టము, 6. మిత్రుడుడు సుఖకరము, 9. చీమలు పెట్టిన పుట్టలు, 14. బకాడుడుములుటపాయ.

నిలువు: 1. అగ్రగ్రామి, 2. రసజ్ఞుడు, 3. రామదాసు, 4. చుట్టములు, 5. ముక్కోణము, 7. దురపె, 8. భజన, 9. చీకాకులు, 10. లుబ్ధకుడు, 11. ట్టిటిభము, 12. పువ్వుతోట, 13. టపాకాయ.

విజేతలు - రెండవ బహుమతి: పి. శ్రీనివాసరామానుజం, హన్మకొండ; మూడవ బహుమతి: దశిక కృష్ణమోహన్, నరసాపురం, (ప గో. జిల్లా)

తెలివికి పరీక్ష - జవాబులు: 1. (సి) డ్రైవరు, 2. (బి) 283, 3. (డి) చంద్రుడు, 4. (డి) షేర్లు, 5. (డి) 23:7, 6. కండెన్స్డుపాలను ఉపయోగించి, 7. (డి) మనుమడు, 8. 1. అద్వైతము - బ్రహ్మము 2. బౌద్ధులు - శూన్యము, 3. ద్వైతులు - స్వతంత్రము, అస్వతంత్రము, 4. విశిష్టా ద్వైతము - చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు.

విజేతలు - రెండవ బహుమతి: తెంబూరు గానం, కొరసండ, (ఒరిస్సా); మూడవ బహుమతి: బి రామచంద్రరెడ్డి, మార్కాపూర్, (ప్రకాశం జిల్లా).

మాటల మహిమ - జవాబులు: 1. మంగళసూత్రము (బి), తాళిబొట్టు (డి); 2. అతిశయము (ఎ), గౌరవము (బి), ఆసక్తి (సి), ఇంపు (డి); 3. కొరత (ఎ), అగౌరవము (బి). దోషము (సి), మాయ (డి); 4. గింజలేని ధాన్యము (ఎ), అప్పు లేని హల్లు (బి), సారములేనిది (సి), అసత్యము (డి); 5. మొద్దుతేరినది (ఎ). మందుడు (బి); 6. సహాయము (ఎ), తోడు (బి); 7. దంతములు లేనిది (ఎ), నగలు

లేనిది (బి); 8. పర్యాయము (ఎ). విధము (బి), వేగము (సి) అర్హత (డి).

విజేతలు - మొదటి బహుమతి: పుల్లా పంతుల వేంకట సుబ్బారావు. పాలకొల్లు; రెండవ బహుమతి: దశిక కృష్ణమోహన్, నరసాపురం, (ప. గో. జిల్లా ; మూడవ బహుమతి: పి. సీతారత్నం, విజయవాడ.

ముఖచిత్రవ్యాఖ్య-మొదటి బహుమతి: భమిడిపాటి అప్పల నరసింహులు, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: కె. శ్రీరాములు, మదనపల్లి, (చిత్తూరు జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి: కోగంటి సాంబశివరావు, తెనాలి, (గుంటూరు జిల్లా): మూడవ బహుమతి: సి.రవి, సంగారెడ్డి, (మెదక్ జిల్లా).

మీరైతే...? - మొదటి బహుమతి: భమిడిపాటి అప్పల నరసింహులు, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: కె. శ్రీ రా ము లు, మదనపల్లి, (చిత్తూరు జిల్లా); మూడవ బహుమతి: కుమారి సి. అపర్ణ, తెనాలి.

(58 వ పేజీ తరువాయి)

మల్గోవా ప్రతీఏటా కాస్తాయి. కొన్ని రకాలు కాలనియమం లేకుండా ఏడాదికి రెండు సార్లు కాస్తాయి. వీటిని బారామాసి అంటారు. నీలం కూడా ఈ జాతికి చెందినదే. మామిడిలో కెరొటిన్ (ప్రోవిటమిను A) బాగా లభిస్తుంది. బాగా పండిన పళ్ళలో విటమిను C అధికంగా ఉంటుంది. పచ్చికాయలో కొంత ఇనుము కూడా ఉంటుంది. పొటాషియం, ఇతర ఖనిజాలు కూడా లభిస్తాయి. విటమిను 'A' లోపంవల్ల సంభవించే కంటి జబ్బుల నిరోధానికి మామిడి ఎంతో సహకారి.

ఫ్రూట్ సాలిడ్లు, ఐస్‌క్రీములు తయారీలో మామిడిపళ్ళను ఉపయోగిస్తారు. మామిడి తాండ్ర, మామిడిపళ్ళ వరుగు తయారు చేస్తారు. మామిడికాయతో తయారైన మన ఆవకాయ ప్రపంచ ప్రసిద్ధి పొందింది ఇతర నిల్వ సరకులను ఎన్నిటినో మామిడితో తయారుచేస్తారు. మామిడిపండు 'శీకర్ణం' చాలా రుచిగా ఉంటుంది. చిక్కటి మామిడి రసం, కాచి చల్లార్చిన పాలు, ఏలకులు, జీడిపలుకులు, పిస్తాపప్పు, పంచదార కలిపి చేసుకుంటారు. అమృతంలా ఉంటుంది. మామిడి ఆకులు, మామిడిపట్ట, పచ్చిమామిడి కాయలలో నుండి తీసిన ఔషధాలకు సూక్ష్మ జీవులను నశింపజేసే గుణం ఉంది. మామిడి టెంకలో జీడికి ఆయుర్వేదంలో అనేక ఉపయోగాలు ఉన్నాయి. కోకోబట్టర్‌కి బదులుగా దానినుంచి తీసే నూనెను వాడతారు.

మామిడిపూవు (ఎండినది) రక్తస్రావాన్ని నిలుపుచేస్తుంది. సాధారణంగా విరేచనాలు, దీర్ఘకాలపు జిగట విరేచనాలు మొదలైన జబ్బులకు ఔషధంగా వాడతారు. మామిడి ఆకులలో విటమిను C విస్తారంగా ఉంటుంది. జావా (ఇండోనేషియా), ఫిలిప్పైన్స్‌లో లేత మామిడి ఆకులు శాకాహారంగా తింటారు. మామిడిరొట్ట పశువులకు మంచిమేత. మామిడి ఆకులు తోరణాలు కడతారు. మామిడి ఫల జాతులలో రాణి. మామిడి పండుతిని మంచినీళ్ళు తాగవద్దు! జాగ్రత్త!

"అసాధారణ ప్రజ్ఞావాటవాన్ని [illegible]
దివ్యాంశముగా చిత్రించుట మతములలో [illegible]

